శేషాచార్య, పరాశరం

హరిశ్చంద్ర చరిత్రము

చెన్నపురి, 1917

Record no. 514

Śēṣācārya, Parāśaraṃ

Hariścandra caritramu

Cennapuri, 1917

Record no. 514

**SUNDARAYYA VIGNANA KENDRAM**
1-8-1/B/25/A, Bagh Lingampalli
Hyderabad – 500 044, Andhra Pradesh, India

## Bibliographic Record Target

శేషాచార్య, పరాశరం.

హరిశ్చంద్ర చరిత్రము : కంపెనీ డ్రామా / పరాశరం శేషాచార్యులువారి ప్రణీతం.- చెన్నపురి : మురహరి ముద్రణాలయము, 1917.

16, 64 p. ; 22 cm.

Record no. 514

Śēṣācārya, Parāśaraṃ.

Hariścandra caritramu : kampenī ḍrāmā / Parāśaraṃ Śēṣācāryuluvāri praṇītaṃ.- Cennapuri : Murahari Mudraṇālayamu, 1917.

16, 64 p. ; 22 cm.

Record no. 514

35 mm microfilm
Image placement: IA (IIA) IB IIB    Date filming began:

శ్రీరస్తు.

పరాశరం - శేషాచార్యులవారి ప్రణీతము.

# హరిశ్చంద్ర చరిత్రము

## కంపెనీ డ్రామా.



ఈ గ్రంథము

టి- వెంగల్వరాయ నాయునివారి

"మురహారి" ముద్రణాలయ

ముద్రితము.

---

చెన్నపురి.

రిజిష్టర్డు) — 1917. (






గ్రంథకర్తయొసగిన సర్వస్వాతంత్ర్య లేఖన.

సీ స ప ద్య ము.

శోభించునట్టియీ భూమండలంబున భాసురంబౌ చెన్న పట్టణంబు
నందునాలవవంశ సింధుహిమాంశుండు వరనారికేళ సద్వంశభవుడు
అవనిలో గోవింద యాఖ్యుండు కమలేశు పదభక్తినెప్పుడు బరగియుండి
గోవిందమాంబను గామరొప్పు శుభమంది సకలసౌఖ్యంబులసంభరితులై

నగుచు చెంగల్వరాయుని యగణితముగ
గాంచిరత్యంత సంతోష కలితులగుచు
అతనికొసగితియీ గ్రంథ మచ్చువల్ప
మనుచుయితరులుదీనిని యంటరాదు.

ఇట్లు,

పరాశరం - శేషాచార్యులు.

This book belongs to andha. Sidaramaiah

శ్రీ ర స్తు.

శ్రీ విఖనసఋషయే నమః.

# హరిశ్చంద్రచరిత్రము.

## (కంపెని డ్రామా.)

(నాంది)

ఉ॥ శ్రీలచెలంగు రుక్మిణితో జెల్వువహించి నిరంతరంబు దా
జాలగ భక్తవర్యులకు సంపదలిచ్చి దయారసంబునన్
యేలుచునుండు కృష్ణ జగదీశ్వరు డెల్లపు డుల్లమందునన్
మేలొనరించి మమ్ములను మిక్కిలి సత్కృపగాచు గావుతన్.

—* ప్రస్తావన. *—

నాంద్యంతమున సూత్రధారుడు ప్రవేశించి.

సూత్ర. సంతోషము సంతోషము! నేడొక పెద్దకార్యంబు సాఫల్యంబుగా సమకూర్పందలంచి తదర్థంబై కామితార్థ ప్రదాయకుండును, సువర్వానీకవందిత పదారవిందయుగళుండునునగు, వాసుదేవుని ప్రస్తుతించితినిగదా. (సభవంకజూచి) ఆహా! శాస్త్రార్ణవోత్తీర్ణకర్ణధారాయమాన పండితాఖండల విరాజితంబును, మృదుమధుర కవిసముదయ శోభితంబునగు నీసభాసదీయమనంబున కానందంబుగావించుచు నాపై కృపారసము జిలికించుచున్న యదికాని యీసభాసదుల హృదయారవిందంబులెటుల నానందింపజేయుదునో యెరుంగజాలనైనను నాస్త్రీయురాలితో యోచింతుగాక? (తెరవంకజూచి) నటీ! నీవిటకొకసారిరమ్ము.

పాకముదించిపుష్పరస పానముచేకడుమత్తులై యళుల్
శోకతోగానముల్ సలుప సుందరమయ్యె వసంతమంతయున్.

సూ. బాగు! బాగు!! నీగాన కళావైభవమున నల్లె జగురుచున్న యది కాని సకల సత్కళాధురంధరుండగు దేవేంద్రుండు సభాభవనంబునకు పరివారంబుతో రాబోవుచున్నవాడు కావున మనమిచ్చటనుండుట సమంజసముకాదు పోవుదమురమ్ము.

(అని నిష్క్రమింతురు.)

---

# ప్రథమాంకము.

## (రంగము—అమరావతీపురము..

### సభాభవనము.

దేవేంద్రుడు, దిక్పతులు, ఋషిశ్రేష్ఠులు ప్రవేశము.

దేవేం. హే వీతిహోత్రా! లోకత్రయంబునందలి బ్రహ్మర్షి, దేవర్షి, రాజర్షి, మొదలుగా భూసుర వర్గంబు లవిచ్ఛిన్నంబులుగా వాజపేయపౌండరీక యశ్వమేధాది మహాద్యజ్ఞంబులొనరించ నందలియాజ్యాహుతులచే బరితృప్తినొంది స్వేచ్ఛావిహారంబునఁ బ్రవర్తిల్లుచున్నవాడవే!

అగ్ని. హే త్రిలోకాధ్యక్షా! దేవఋషి భూసురులొనర్చు మహాద్యజ్ఞంబులందలి యాజ్యాహుతులచే బరితృప్తినొంది యత్యంత సంతసంబున దేవరవారి యాజ్ఞాబద్ధుండనై స్వేచ్ఛచే మెలంగుచున్నవాడ?

దేవేం. హే సంయమనీపురాధ్యక్షా! లోకంబునందలి మానవానీకంబులొనర్చు పుణ్యపాపంబులఁ జక్కగవిచారించుచు వారివారిపాపభేదంబుల నరయుచు రౌరవ కుంభీపాకాది ఘోరనరకంబులఁ గూలనేసి యనుభవింపఁజేయుచు నిర్మలచిత్తంబున నప్రమత్తుండవై ప్రవర్తించుచున్నవాడవే!



యము. హే దేవేంద్రమహారాజా! మీయాజ్ఞావశవర్తుండనై ధరాతలంబున నరసముదయంబులొనర్చు పుణ్యపాపంబులు చక్కగ నరయుచు వారివారికిఁ దగవగు నరకంబు లనుభవింపఁజేయుచు నతిజాగరూకుండనై దక్షిణదిగాధిపత్యం బొనరింపుచున్నవాడ?

దేవేం. హే వరుణా! నీవుసముద్ర నదీనదంబుల కధిపతివై నాగపాశధరుడవై దుష్టనిగ్రహ శిష్టప్రతిపాలనం బొనరించుచు పశ్చిమ దిగాధిపత్యుడవై ప్రమాదంబులేక పరిపాలించుచున్నవాడవే!

వరుణు. హే సంక్రందనా! తమయాజ్ఞానుసారంబుగా పశ్చిమదిగాధిపత్యంబువహించి దుష్టశిక్షణంబొనరించుచు సుజనపరిపాలనయం దిసుమంతయైన గొరంతవాటిల్లక జాగరూకతఁ బ్రవర్తించుచున్నవాడ?

దేవేం. హే ధనాధిపా! నీవుఅలకాపురాధ్యక్షుండవై యుత్తరదిగాధిపత్యంబువహించి శంఖపద్మ మహాపద్మకచ్ఛపాది నవనిధులఁగలిగి సకల సామ్రాజ్యవైభవోపేతుండవై కృపాకటాక్ష వీక్షణంబుల యక్షుల రక్షత్వంబుఁ బరిపాలనం బొనరించుచున్నవాడవే!

కుబేరు. సురేంద్రా! సర్వ సంపత్సమృద్ధికరంబగు నవనిధులఁగలిగి యక్షనాయకుండనై దక్షతంబున రక్షోగణంబులం శిక్షించుచు తమయక్షీణ కటాక్షంబునఁ బక్షపాతంబులేక సుజనరక్షణంబొనరించుచున్నవాడ?

దేవేం. బృహస్పతులవారూ! లోకయంబునందలి బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్రాది చాతుర్వర్ణంబులు తమతమ స్వకులోచిత కృత్యంబులు చక్కగనొనరించుచు సుఖంబున్నవారలే! మునిసంఘంబులు తమకనుష్ఠేయంబులగు తపోయజ్ఞంబులయందప్రమత్తులై చక్కగ వర్తించుచున్నవారలే!

బృహ. దేవనాయకా! నీవుత్రిలోకాధ్యక్షుండవై రక్షణంబొనరించుచుండ గొరంతవాటిల్లునే! బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్ర చతుర్వర్ణంబులు తమతమవిహితాచారంబులగు స్వకులాచారధర్మంబులు చక్కగనెరవేర్చుచున్నవారలు ? ఋషిగణంబులు తపో

పదివేల ఋషిప్రవరులుంగూడి నతని హృదయంబుగలంచి మాయాజలధింముంచి మహాదుఃఖ సమగ్రుంజేసినను యణుమాత్రంబైన నాధరారమణుండు బొంకజాలునే, యంతియగాక పూజ్యంబగుతపస్సాంమ్రాజ్యం బెడబాసినను సత్కళత్రంబు మిత్రత్వంబు లేక వర్జించినను తనప్రియసుతుండు మృతప్రాయుండైనను హీనకృత్యంబులవలన దుర్దశత్వంబునొందినను యెట్టి మనోదుఃఖంబులనుభవంబైనను నారాజేంద్రుండు మనోవాక్కాయ కర్మంబుల ననృతంబాడనేనీ మత్ప్రతిజ్ఞ వినుండు.

వశి॥ (గంభీరముగా.)

సీ. ననుజూచినీవును మునులెల్లనవ్వంగ ఘనమగువిప్రత్వమును
విడచియును । వేదశాస్త్రంబులు విడచియుజపమంత్ర తం
త్రముల్ దిగనాడి తపమువిడచి। స్నానసంధ్యానుష్ఠ సత్క్రి
యల్విడచియు మొలకట్టునార చీరలనువిడచి । ముండనం
బొనరించి మొగిజన్నిదముద్రెంచి నరకపాలంబును కరమునందు.

బూనియపవిత్రమైయొప్పు బూదినలది
ఖరముపైనెక్కియామ్య దిగ్గమనమొంది
ప్రజలుననుజూచిరోయ భీభత్సరూప
మునను నేగెదహీనులు గనుచునుండ.

విశ్వా. (కోపముతో) ఒరే ఋషికులపాంసా ! వశిష్ఠా సురమునివర గరుడగంధర్వ కిన్నరకింపురుషాది వియచ్చర బృందంబులు వినుచుండ మత్ప్రతిజ్ఞావాక్యంబులువిను చలంబు బలంబున ధర్మరక్షణ దీక్షాదక్షుండును సత్యమావిచక్షణుండును నగు నా హరిశ్చంద్రుని మదుర్భరి కోపాగ్నికింధనంబుగనొనర్చి ననేకమాయోపాయంబులంబన్ని నాతని నవార్య చాతుర్యశౌర్య ధైర్యంబులడంగించి మానవహీనునింగాంచియే వానింబొంకింతు. మత్కోపాగ్నికి న్నిర్వహింప నీహరిశ్చంద్రుండన నెంత సునాశీరుండు భయవిహ్వల మానసుండయి ప్రకంపితశరీరుండగుచు విత్రస్త



శతకోటిహస్తుండునై పేరోలగంబుందుండునే, బృందారకబృందంబులు డెందంబులనమందంబులను భయంబులం బొందకుందురే, మునిజనంబులన్యోన్య ముఖావలోకనంబులు సెలంగ జటాభారంబులు వీడి నేలందూలియాడ నలుదిక్కులం బారకుందురే, కుంభినిదిర్ధిరందిరుగకుండునే, దిక్కుంభికుంభంబులు ప్రమ్రుగ్గకుండునే, జలజభవుమనంబు జలించకుండునే, తారకంబులు జలజలంరాలకుండునే, రవిచంద్రుగతులం దప్పకుండునే, యిట్టితావకలు మహోగ్రకోపంబున శౌక్కరాజమాత్రుండు నిలవంజాలునే, యయినంగానిమ్ము. మత్ప్రతిజ్ఞ యమ్మహీపాలుర్నిం బొంకింపలేకున్న లలాటలోచనుంగూర్చి మున్నేనొనర్చిన తపంబులో నర్ధాంశంబొసంగి లౌకికఖ్యాతిగా చతుర్దశ మహాయుగంబులతనింపూజ్యంబగు సాంమ్రాజ్య విస్ఫూర్తులంబొందించి యనంతరంబత్రిదివంబున బదునాలుగుమన్వంతరంబులు నముచిసూదనునర్ధాసనంబున లోకపరాయణుండగు నారాయణుండు సృష్టిరచనా విశారదుండగు శారదావల్లభుండును త్రిపురాంతకుండగు కైలాసనివాసుండును జూచుచుండ నిలుపువాడ.

(నిష్క్రమించును.)

---

## (రంగము - అయోధ్యాపురము.)

హరిశ్చంద్రుడు - సత్యకీర్తి ప్రవేశము.

హరి. సత్యకీర్తీ! మనరాజ్యంబున భూసురులు యజనయాజనాధ్యయనాధ్యాపక దానప్రతిగ్రహ షట్కర్మనిరతులై వేదశాస్త్ర పురాణేతిహాసంబులయందు యప్రమాదులై ప్రవర్తించుచున్నవారలే, క్షత్రియులు తమతమ రాజ్యంబులు చక్కగపరిపాలించుచు ధర్మసత్య దయాశౌచంబులంగలిగి సామదానభేదదండాది చతురోపాయంబుల సమర్థులై వర్తించు చున్నవారలే,

వైశ్యులు కృషివాణిజ్యగోరక్షణాది స్వకులోచిత ధర్మంబులాచరించుచు కుబేరునిధిక్కరించు ధనసంపదలం గలిగి సతి జాగరూకులై నొప్పుచున్నవారలే! శూద్రులు త్రైవర్ణికులకు విధేయులై బ్రాహ్మణ సేవకావృత్తినొనర్చుచు మేరమీరక కులాచారధర్మంబుల నడుపుచు వినయవిధేయతల నున్నవారలే!

సత్య. సూర్యకులావతంసా! మనరాష్ట్రంబున భూసురులు తమకనుషేయంబులగు స్నానసంధ్యాద్యనుష్ఠానాది కృత్యంబులు కాలాతిక్రమణంబులు లేక చక్కగ నొనర్చుచు వేదశాస్త్ర పురాణాది నానావిధ విద్యలభ్యసించి సాంగాధ్యాయకులై ప్రవర్తించుచున్నవారలు? రాజులు తమకువిహితాచారంబులగు రాజదండనీతిశాస్త్రంబులయందలి ప్రవీణులై తమతమ రాజ్యంబులు ధర్మయుక్తంబుగా ప్రజాపాలనంబొనర్చుచు రాజాంగంబుల నభివృద్ధినొందించుచు చారులవలన లోకవ్యవహారంబులు వినుచు దయాసత్య ధర్మంబులయందలి వర్తింపుచున్నవారలు ? వైశ్యులు కృషివాణిజ్య గోరక్షణాదులొనరించుచు కులాచారధర్మంబులు నరపుచు ధనంబులార్జించుచు నిర్మలచిత్తులై వర్తించుచున్నవారలు? శూద్రులు త్రైవర్ణికులకనుకూలులై భూసురులకు విధేయులై వారియాజ్ఞానుసారంబుగ కులాచారధర్మంబు లొనరించుచున్నవారలు.

హరి. అమాత్యవర్యా! మహాఋషులు యమనియమ ప్రాణాయామ ప్రత్యాహార ధ్యాన ధారణాద్యష్టాంగయోగ ప్రవీణులై యాశ్రమంబులందలి క్రూరమృగాది బాధలులేక తపోనిష్ఠాగరిష్ఠులై కందమూలఫలాదు లాహారంబులుగాగొని శిష్య ప్రశిష్యగణ సమేతులై సుఖంబున్నవారలే ! నట విట కవి గాయక వైణిక వైతాళిక పరిహాసకాది విద్వద్బృందంబులు డెందంబుల నమందానందంబునొంది వర్తింపుచున్నవారలే.



సత్య. రాజశేఖరా! మహాఋషులు తమతమ యాశ్రమంబులందలి క్రూరమృగాది బాధలులేక అష్టాంగ యోగాభ్యాస పరులై తపంబు లొనర్చుచు శిష్యగణంబులతో సుఖంబున్నవారలు? నట విట కవి గాయక వైణిక వైతాళిక పరిహాసకాది విద్వజ్జనంబులు తమతమ పనులయందు జాగరూకులై యనుష్ఠించుచు సంతసంబునొందుచున్నవారలు.

### విశ్వామిత్రుడువచ్చుట.

వారం. తపోధనాగ్రగణ్యా! యభివందనంబొనరించెద.

విశ్వా. భాస్కరకులావతంసా! దీర్ఘాయుష్మంతుడవుగమ్ము.

హరి. ఈభద్రసింహాసనంబున వసింపుడు. తాపసవర్యా తాము విచ్చేయుటచే మద్గృహంబు పావనంబయ్యె, యేను కృతార్థుండనైతి, మద్రాజ్యంబున సర్వసంపత్సమృద్ధిచే ప్రకాశింపుచున్నయది, తాము విచ్చేసినకార్యంబు చక్కగ వక్కాణింపుడు నెరవేర్చెద.

విశ్వా. రాజశేఖరా! యేనొకజన్నంబొనరింపం బూని ద్రవ్యసహాయంబునకై మీసమ్ముఖంబునకు వచ్చినవాడ ద్రవ్యలేమిం జేసి ఇక్కార్యంబు జేయం బ్రయత్నించినను సమకూడదయ్యె గాన వలయుధనంబొసంగి యజ్ఞపూర్తిగావింపం గోరెద.

హరి. మునిపుంగవా ! మీరు ప్రయత్నించినకార్యంబున కిసుమంతైన గొరంతవాటిల్లునే యాజన్నంబవిచ్ఛిన్నంబుగ నొనరింపుడు వలయునంత ధనంబొసంగెద.

విశ్వామిత్రుడు.

క॥ కరినెక్కి నిక్కి మనుజుడు । వరమణిమీటంగనంతవలయుధనంబుల్ ।
ధరణీనాయకయీయ । ధ్వరమునకుం జాలునీవు దయచేయుడికన్ ॥

హరి. మునివర్యా! మీరు కోరినధనంబంతయు నొసంగెద గ్రహింపుడు.

విశ్వామిత్రుడు.

క. ఒప్పుగనిమ్మదిగవనే । నిప్పుడుబలికితినిగాని యిపుడొల్లనునా।
కెప్పుడుసమయముగలుగునొ । యప్పుడుయిప్పంగవలయునంతధనంబున్.

(అని విశ్వామిత్రుండు నిష్క్రమించుట.)

హరి. అమాత్యశేఖరా! విశ్వామిత్రుడు తానొనర్చుజన్నంబునకు వలయునంతధనంబుగోరి యిపుడొల్లక సమయంబరసివచ్చి ధనంబు గొనిచనువాడననివక్కాణించిచనియె. అతనికిగలుగుసమయంబునకింతధనంబేక కాలంబుననిటనుండుట సంభవించునో లేదోయను విచారంబునామనంబునం బొడముచున్నయది. ఆహా! అతండిపుడు ధనంబొల్లక పోవుటకేమి హేతువో తోచకున్నయది అతండు సామాన్య ఋషిమాత్రుండని చెప్పనొప్పునే, సృష్టికి ప్రతిసృష్టినొనర్చినవాడు, క్షామసంబున దూర్వాసుంబోలినవాడు యాతనికృతకృత్యుండ నెట్లయ్యెదనో దెలియకున్నయది.

మంత్రి. భూపాలకా! ఆతపోధనుండెట్టిసమయంబు వేదివచ్చిననువలయు నంతధనంబుభాండాగారంబుననిండి యుండంజేసెదనందియంబేల.

(యింతలో కాపులువచ్చి.)

కాపు. హరిశ్చంద్రమహారాజా! యభివందనంబొనరించెదము, దేవరవారిరాజ్యపరిపాలనంబున మేమెప్పుడిట్టికష్టంబులెరుంగము, యెన్నడుంగని యెరుంగని సింహశరభశార్దూల యిభవరాహ చమరీమృగాది క్రూరమృగ సముదయంబులు ఫలితంబులైయుప్పు సస్యంబులెల్ల పెకలించి చించి చెండాడి బోవుచున్నయవి. మేమెన్నివిధంబులన్ గాపాడినను సాధ్యంబుగావయ్యె. మేమహోరాత్రంబులు కాచి చూచి విశికి వేసరి మీసన్ముఖంబున కరుదెంచి విన్నవించినారము. తాము శీఘ్రంబవిచ్చేసి యాక్రూర



మృగంబులన్ దరిమి మాకు జీవనోపాధినొసంగకుండిన మేము బ్రతుకంజాలము శెలవొసంగుడు.

హరి. కాపులారా! వెరవకుండుడు మీకష్టంబులందీర్చెద మీపైరులం జారబుచ్చెడి క్రూరమృగంబు నారాచంబులన్ గూల్చి మీమనోఖేదంబులడంచి సంతసంబొనరించెద శీఘ్రంబజనుండు.

హరి. (మంత్రినింజూచి) సత్యకీర్తీ! క్రూరసత్వమృగంబుల న్వేటాడుటకై విపినంబున కేగవలయుగాన శీఘ్రంబ వేటకాండ్రం బిలుపింపుము.

మంత్రి. మహాప్రభో! తమయాజ్ఞానుసారంబుగ వేటకాండ్ర నతివేగంబున బిలిపించియున్నవాడ.

హరి. భటులారా! క్రూరమృగంబుల న్వేటాడుటకై యరణ్యంబులకేగవలయుగాన నాయుధపాణులై వెడలుండు.

(అంతటలేచి యంతఃపురంబునకు నిష్క్రమించును.)

చంద్ర. మనోహరా! యభివందనంబొనరించెద.

హరి. సఖీ కళ్యాణ్? కళ్యాణ్?

చంద్ర. నాథా! యీభద్రసింహాసనంబునన్ వసింపుడు.

హరి. (కూర్చుని) హేప్రియసీ! మనరాష్ట్రంబునందలి కాపుజనంబు లీదినంబున మత్సభకరుదెంచి దీనాలాపంబులాడి రదియెద్దియనిన, ఘోరవన్యమృగంబులెల్ల తమభూములందలి ఫలితంబుల సస్యంబులనెల్ల విధ్వంసంబు గావించుచున్నయవి. మీరాజ్యంబునందలి యిట్టిఘోరం బెన్నడెరుంగము గాన మీకసాధ్యంబైయుప్ప యాదుష్టమృగ ధ్వంసంబుగావించి మమ్ము రక్షింపకుండిన మేము జీయింగలవారమని పలువిధంబులన్ ప్రార్థింప

నేనిప్పటికి శీఘ్రంబ విచ్చేసెదనని వారలనొడంబఱచి బంపినవాఁడ, యేను క్రూరమృగంబుల వేటాడఁబోవం దలంచితి.

చంద్ర. ప్రాణనాయకా! యేనుమిమ్ము విడచి యొక్క క్షణమాత్రంబైన నుండఁజాల నామనంబు మృగయావినోదంబు జూడఁగోరుచున్నయది గాన దయార్ద్రపరిపూర్ణమానసుండవగుచు నన్నును మనప్రియపుత్రుండగు లోహితాస్యునిఁ గొనిచనఁ బ్రార్థించెద.

హరి. ప్రాణనాయకీ! మృగయావినోదార్థంబున కేగుతఱి స్త్రీలఁ గొనిచన నుచితంబుగాదైనను నీకోరిక వ్యర్థంబుపుచ్చ భావ్యంబుగాదు గాన ప్రియపుత్రునిఁ దోడ్కొనిరమ్ము పోవుదము.

చంద్ర. మహాప్రసాదము.

(హరిశ్చంద్రుడు సపరివారంబుగా నరణ్యంబున కేగి మృగయావినోదంబు చేసి యొకవృక్షంబుక్రింద విశ్రమించి చంద్రమతిఁ గని.)

హరి. చంద్రమతీ! కుసుమఫలభరితంబులై శుకపికనికర కలకలనినాదంబులఁ గలిగి లతాగుల్మ తరుచ్ఛాయలనీడలచే సొంపు సొంపాదించి క్రూరమృగ సత్వవిహీనంబై రాయంచ మరాళ విహారవినోదంబై కకుల కలహారాదిశోభితంబై నేత్రానందకరంబగుచు సరోవరంబులు ప్రకాశింపుచున్నయవి. ఆహా! యివ్వనంబు చైత్రరథ నందన వనంబులఁ బోలి యొప్పుచున్నయది, యిచటికి సమీపంబున మనకులగురువులగు వసిష్ఠులవారి యాశ్రమంబున్నయది మన మచటి కరిగి వారలఁ దర్శించి మనపురంబున కేగుదమురమ్ము.

(వసిష్ఠాశ్రమము, హరిశ్చంద్రుడు ప్రవేశించుట.)

హరి. చంద్రమతి. గురువరాగ్రగణ్యా! యభివందనం బొనరింతుము.



వసి. సుఖీభవ! సుఖీభవ! రాజా! మీరలిప్పుడు మదీయాశ్రమంబునకు విచ్చేయుట సుదినంబు, యెచ్చటనుండిచ్చటికి విచ్చేయుచున్నవారలు.

హరి. ఋషివర్యా! బాలంబులయందలి సస్యంబులు వన్యమృగంబులు నష్టంబుచేయుచున్నవని కాపులు మొఱలిడ వారల కోరికదీర్చి రక్షించుటకొరకు మృగయా వినోదార్థం బరుదెంచి క్రూరజవసత్వ మృగంబులఁ ద్రుంచి మత్పురంబున కేగుచు భవద్దర్శనార్థం బిటకరుదెంచినవాఁడ.

వసి. సూర్యకులప్రదీపా! కాపులకుంగల కష్టంబులు దీర్చ మృగయావినోదార్థంబు నీవరుదెంచుట యుచితంబె, అయినను అంతఃపురవర్తులగు స్వకులాంగనల నిట్లు దోడ్కొనివచ్చుట మేరగాదు. నీకొక్కసందేశం బెఱింగించెదవినుము యిచ్చటికి సమీపంబున తమోగుణప్రధానుండగు విశ్వామిత్రు నాశ్రమంబు గలదు. ఆతండు ఋషిమాత్రుండని చెప్పుటయే గాని యంతదురాత్ముం డిద్ధరాతలంబునఁ గానంబడడు, గాన వానిచెంత కేగంజనదు యిటనుండి యెచటి కేగక భవదీయపురంబున కరుగుము యింక నాలస్యంబొనరింపకుము.

హరి. గురువరా! మహాప్రసాదము. తమరు వాక్రుచ్చినటుల మత్పురంబున కరిగెద, పోయివచ్చెద యభివందనం బొనరించుచున్నవాఁడ.

(అని నిష్క్రమించును.)

—* విశ్వామిత్రాశ్రమము. *—

విశ్వా. (తనలో) అహాహా! యీ హరిశ్చంద్రుండు మృగయా వినోదార్థంబరుదెంచి మదియాశ్రమంబునకువచ్చి నన్నుం గాంచక యే కులగురువగు వసిష్ఠునితో సంభాషించి తనపురంబున కేగుచున్నవాఁడు. కానిమ్ము మత్కపటోపాయ కృత్యంబున నొక కనక మృగంబును సృజించి వేటనెపంబున వానిఁ నాచెంత కొచ్చునటులఁ జేయువాఁడ.

(అని కనకకురంగం బొకదానిఁ జూచిన.)

లోహి. (మాయ లేడినిఁ గని) హేజనకా! మనయగ్రభాగంబున, గ్రేళ్ళు రుకుచు కనకమృగంబు సంచరించుచున్న యది దానిఁ బట్టి యా డుకొనవలయునను దలంపు నాకుఁ బొడమియున్న యది గాన దానిఁ బట్టి నాకొసంగుడు.

హరి. కుమారా! నీవు కోరినటుల యాకాంచన మృగంబునుఁ బట్టి దెచ్చి నీకిచ్చెద సంతసింపుడు.

(ఇట్లు హరిశ్చంద్రుండు మాయకురంగంబు వెంటఁ జన
నది విశ్వామిత్రు నాశ్రమప్రాంతంబునకరిగి మాటువడిన.)

హరి. (తనలో) ఆహా! యీ మాయకురంగంబు నన్నలయించి విశ్వామిత్రు నాశ్రమప్రదేశంబునఁ డాగె. కానిమ్ము దీనినిఁ విడుచుట నాకుఁ దగునే.

(అని కార్ముకంబెక్కిడి క్రూర నారాచంబున దానిఁ బడ నేయక విడువనని క్రోధోద్దీపితమానసుండై శరంబువిడువ నాకురంగంబు గాధినందనుని మ్రోలకుం జని నదృశ్యంబయ్యె.)

హరి. (చంద్రమతికడకుంజని) ప్రియసఖీ! మనల నిమ్మాయా మృగం బతిదూరంబుగొనివచ్చి మనల నలయించి మదీయ శరపాతంబునకుం దప్పి యంతర్హితంబయ్యె నింక నేమి సేయువారము. శరీరంబు డస్సి పరితాపంబు నొందుచున్న యది దాహంబగ్గలంబయ్యె. నివ్విపినంబున జలాశయం బెయ్యెడ నుండునో వెతకుచు నచటి కరుగుదము రమ్ము.

చంద్ర. నాథా! నాకును దాహం బతిశయించుచున్నది కొంతదూరంబున నొక సరోవరంబున్న యటుల గానంబడుచున్న యది శీఘ్రంబ చటికరిగి దప్పిఁ దీర్చుకొని కొంతదవు విశ్రమించి మన పురంబున కేగుదము లెమ్ము పోవుదము.



(యొక్క సరోవరంబు కడకుంజని.)

హరి. ప్రాణనాయకీ! యిజ్జలాశయం బెంత రమణీయతరంబుగ నున్న యది మధురయుక్తంబగు నీశీతలోదకంబవగాహనంబు జేయుము.

(ఇట్లు జలావగాహనంబు జేసి నిర్మలతరుచ్ఛాయ నీడలఁ సచివపుత్ర కళత్రాదులఁ గూడి సుఖంబున్న యెడ చంద్రమతీదేవి యంక పీఠంబున శిరస్సునిడి హరిశ్చంద్రుండు శయనించి యొక స్వప్నంబుగాంచి చిత్తవిభ్రమంబు నొందియున్న యెడ.)

చంద్ర. ప్రాణపతీ! సుఖంబున నిద్రించి మేల్కాంచి తత్తరంబగు చిత్తంబుతో బిత్తరిచూపుల నిత్తెరంగునఁ నుత్తలపాటు నొంద నేత్రంబుల నశ్రుకణంబులుద్రోరంగ నిట్లుండుటకు గతిం బెయ్యదియో నాకేమియుఁ దోచకున్న యది.

గీ. ఏమి హేతువో యిటులుండ నేరుకపడదు
చిత్తమందున గనునట్టి చిత్రమేమొ
నాకు మెరుగంగ జెప్పుము ప్రకటముగ
భూరి గుణసాంద్ర రవికుల పూర్ణచంద్రా.

హరి. (ఉలికిపడి) అయ్యో ప్రాణనాయకీ! చంద్రమతీ, మన కెట్టి కష్టదశలనుభవంబయ్యె.

చంద్ర. (తత్తరపాటుతో) మనోహరా! భయపడకుము, నేను మీచెంగ్గ దనే యున్నాను కన్నులువిప్పి నన్ను జూడుము, భయపడకుము, ఏమది చెప్పుము.

హరి. (కన్నులువిప్పి) ప్రాణేశ్వరీ! ఏమని చెప్పుదును.

రాగం - శంకరాభరణం - ఆదితాళం.

కలికి నేనొక కలకల గంటిని - ఘనముగ దెల్పెద వినవే
నలలితరత్న నగితపీఠమున - కొలువుండెడి వేళ. కలి.

భూసుర డొక్కఁడువచ్చెను - తానతి రోషంబున నాకడకు
భాసురమగునస్మత్కిరీటమును - బడదన్నెను ధరపైకి. కలి.
అంతటఁబోకను శిరముబట్టితా - నపుడునన్ను బడవైచి
పంతంబునపుర వీడలదోలెనను - బ్రాహ్మణోత్తముఁడురోసి. క.
అమితకష్టదశ లనుభవించినే - కమలాక్షుని సత్కృపనూ
ప్రమదముతో మద్రాజ్యము - గైకొనిపాలించుచునుంటి కలి.
వనజాక్షిరో వినుపేరుకల్పురి ని - వాసుఁడైన మురహరుఁడూ
ఘనముగ శేషయ వరదుఁడు మనపై - కరుణమరచెనోయిపుడు కలి

చంద్ర. పంచపాది చంపకమాల॥

ఇనకులసార్వభౌమ మదినింతభయం బిపుడొంద నేల యా
ఘనద్విజవర్యుఁ డెవ్వఁడన గాధిసుతుండు నిజంబుయుత్తరీ
కనకకిరీటముల్ ధరను గాలనుదన్నుట రాజ్యసంపదల్
చనుటబహుప్రయాసములు చాలగగల్గిన పద్మలోచనుం
డనయము రాజ్యసంపదల నారయనిచ్చి కృపన్ గనున్ ధరన్॥

(వీరిట్లు విచారింపుచుండ.)

విశ్వా. (తనలో) హరిశ్చంద్రుఁడు మనయాశ్రమవనంబున కరుదెంచి, కళత్రంబుతోనున్నవాఁడు, యిప్పుడు యేనొక్క కపటోపాయంబున మతంగకన్యలనుసృజించి వారలనెపంబున యాధరాధిపుఁ బొంకించెద, నాకిదియే మంచిసమయంబుగానున్నయది.

(అని మతంగస్త్రీల నుద్భవింపం జేసిన.)

మతంగ. జనకా! యభివందనం బొనరించెదము. మమ్ముల సృజించిన కార్యంబెయ్యదియో నెరింగింపుడు క్షణకాలంబులో నెరవేర్చెదము.

విశ్వా. మతంగాంగనలారా! మన యాశ్రమ విపినంబున హరిశ్చంద్రుం డను రాజేంద్రుండు కళత్రంబుతో వచ్చియున్నవాఁడు, మీరలతి



శీఘ్రంబున నచటికేగి నటచాతుర్యాది కృత్యంబులునలిపి వానిని సంతసింపం జేసిన నాతండు మీకోరికనొసంగెద నెల్పుండన మీరలు రాజహారంబులగు వస్తువులఁగోరుఁడు నాతండొసంగకున్న వానిన్ పాణిగ్రహణంబొనరింపంగోరుఁడు, అందుల కతం డియ్యకొనిన తెరంగెరింగి మత్సముఖంబున కేగుదెండు వేగంబ చనుండు

మతం. తాపసేంద్రా! మహాప్రసాదము.

(హరిశ్చంద్రుకడకుం జని.)

రాజపురందరా! యభివందనం బొనరించెదము.

రాగం - నాదనామక్రియ - రూపకతాళం.

క్షితిపాలా - వరశీలా - ధృతలోలా - విమలా
శ్రితపోషణ - భవశోషణ - హితభావన - సుగుణా॥ క్షితి.
మరుకోలల - కిక నోర్వర - మరులొందితి - గదరా॥ క్షితి.
శుకకోకిల - ములకేకల - కిక తాళగ - దరమా॥ క్షితి.
ధరపేర్కల - పురిశేషయ - వరసేవితు - సాక్షిగ॥ క్షితి.

హరి. (సంతోషముతో) మానినీమణులారా! మీరెచ్చటనుం డిచ్చటికేకారణంబున వచ్చియున్నవారలు. మీగానవిద్యా కౌశలమ్మున కేను సంతసించితి. యీమణిమయ ధనకనక వస్త్రాభరణంబు లొసంగెదన్ గొనుఁడు.

మతం. రాజాగ్రగణ్యా! నీవు నవమన్మథ మన్మథాకారుండవును, అవార్య శౌర్య ధైర్య ధుర్యుండవును, సకల సామ్రాజ్య లక్ష్మీవిశదైశ్వర్యాతిశయుండవును, దానరాధేయుండవును, సత్య ధర్మస్వరూపుండవును, సంగీత విద్యాతత్వసారసంగ్రహుండవుటనగు మమ్ముల్ గాంచి కృతార్థులమైతి మింక మీరొసంగు ధనవస్త్రాభరణాదులేమొల్లము మదీప్సితంబొసంగెదరేని మీ సితచ్ఛత్రంబొసంగుఁడు, యింక నెద్దియొసంగినను మేముగైకొనము.

హరి. (కోపముతో) దుష్టకన్యలారా! యిట్టికోరిక కోరిన వారి నేనచటన్ గాన, రాజార్హంబగు సితచ్ఛత్రంబుగోర మీకెట్లు నోరాడె, యిట్టి దుర్మార్గకృత్యంబు మీకెవ్వరు గరపిరి. ఛీ ఛీ, యిలాటి దుర్భావములాడకుడు, మేరమీరి నోరికొలంది బలుకుచున్న వారలు మీర లేకులంబువారలో జక్కగ వక్కాణింపుడు.

మతం. హరిశ్చంద్రమహారాజా! దెల్పెదము వినుండు.

రాగం- హిందూస్తానితోడి - అదితాళం.

సంగీత- నిపుణులముమా- తంగకన్య- లమయ్యా-
అంగజశతరూప- సంగీతప్రియభూప-
పొంగుచు- వేగమునా - లింగనము- సంగుమా॥ సం
నినుగోరి వచ్చితిమి- నెనరుంచి గ్రహింపుమీ-
అనుమాన మేలనయ్యా- నినుబాసి తాళమయ్యా-
మనుజేశ- మనవిగైకొని- తనివిదీర్చి- బ్రోవుమా॥ సం
మరులు మిక్కటమాయె- మనసునిల్పగ లేము-
మరుకేళి గూడిపొమ్ము- మరుబారికోర్వ లేము-
ధరపేరు కలపూడి- ధామునిన- మ్మితిమీ॥ సం

హరి. ఛండాలబాలికలారా! మీరింగితం బెరుంగక మదిరాపాన వికారంబుచే శరీరవిస్మృతంబొంది ప్రలాపంబాడుచున్న వారలు.

గీ. నరసకును మీరు రాదగ జనదుగాన
కాగలిమ్మని కోరంగ గాదు మీకు
నాలుకెట్లాడె మోదుష్ట నారులార
దెలిసె మీజాతికృత్యంబు తేటబడగ.

హరి. గావున మీస్వరూప స్వభావంబులు గాంచ యావక ముద్రావిశేషంబులుగానంబడవు. మీరొక్కడి మాయాఛండాలాంగనలో వారు యాశ్చర్యంబగుచున్న యది. యైనను దయార్ద్రంబున మీయపరాధంబు లియ్యెడ సహించితి పొండుపొండు.



మతంగ. గీ. ధారుణీపతి యిచట లతాగృహంబు
రాజిలుచునుండె యోగ్యమై రతివిహార
లీలలొనరించ సమయంబు లేచిరమ్ము
యంగజుని బాణములకు నోర్వంగ లేము.

హరి. ఛండాలురాలారా! మీర లుద్యోగించిన కార్యంబు మాకెరుంగంబడె, మీరు మదాంధులై మాబోట్ల నీరీతి మేరమీరి నోరుకొలదిన్ ప్రలాపించుచున్న వారలింక వాక్రుచ్చితిరేని మత్కరవాలంబున మీనాలుకల్ గోయుచున్న వాడ. (యని లేచును)

చంద్ర. (అడ్డంబునిల్చి) నాథా! యిమ్మహీతలంబునం దెన్నడైనను కనకసారంగంబులున్నవని గనివిని యెరుంగుదమే, యీమాయామృగంబు వెంబడిన్ బడి బుద్ధిహీనత నిచటికే తెంచితిమి. అదియునుంగాక, ఛండాలాంగనల కింత చక్కదనం బెట్లు సంభవించు, యీకృత్యంబులుజూడ గాధిపుత్రుని కపటోపాయంబై యుండునని నాకున్ దోచుచున్నయది, మన కులగురుండగు వసిష్ఠమహామునీంద్రుండు కృపాగరిష్ఠుండై మనల కెరిగించియున్న వారలు. మన మటులొనరించక బోవుటచే నిట్టివిపరీతకృత్యంబులుగాంచగలిగె, కానిమ్ము. యిబ్బాలికలను శిక్షింప నర్హంబుగాదు గాన యనుగ్రహింపుడు.

(మతంగ కన్యలు నిష్క్రమింతురు.)

విశ్వా. మతంగాంగనలారా! వాడిన మోము దామరలతో నొప్పి చెందిన కాయంబులతో వీడి చిక్కులుబడ్డ కురులతో రక్తశిక్తంబగు కంచుకంబులతో ఖండితంబులగు కర్ణతాటంకములతో బాష్పధారలం దోగిన పయ్యెదలతో, డగ్గుత్తికనొందిన కంఠంబులతో యత్యంత దైన్యంబు గ్రందుకొన యిటులేగుదెంచితిరి యిందుకు గతంబెయ్యదియో చక్కగవక్కాణింపుడు.

మతం. క. అయ్యా మీమాటలు విని
చయ్యన ధరణీశుకడకు సరసోక్తులతో
నెయ్యమున చనియు దెబ్బలు
వెయ్యారులు బడితిమయ్య విశ్వామిత్రా.

మతం. మునిసార్వభౌమా! తమ యాజ్ఞా వశవర్తులమై యాహరిశ్చంద్రుపాలికేగి గానవిద్యావిశేషంబులమెప్పించి రాజార్హంబగు సితచ్ఛత్రంబు గోరిన నందుకొడంబడకుండిన మముఁగలయఁ గోరితిమి. అందుల కాధరణీకాంతుండు మహోగ్ర కోపోద్దీపిత మానసుండై కరవాలంబు ఝుళిపించి నాలుకలుఁగోయ గమకించి ప్రహరించె. నందులకు ధైర్యంబొంది మీ సముఖంబునకు వచ్చినవారము. (అనిదుఃఖించిన)

విశ్వా. (కోపముతో) బాలికలారా! యేమేమి? యమ్మహీపవరాధముడు మిమ్ము మన్నరుంగక నహంకారియై మిమ్ముల నీరీతి నవమానించెనా! మంచిది, మృత్యుంజయ ఫాలనేత్ర శిఖిలీలం బర్వు మత్కోపానలంబునకు వానినిఁ ధనంబుగాజేసి భస్మీభూతంబుగా వించెద, మత్తపస్సామర్థ్యంబు జూడుడు. (నిష్క్రమించును)

హరి. ప్రియసఖీ! యామతంగకన్యలు యేనొసర్చిన యవమానంబు సహింపజాలక యావిశ్వామిత్రుకడకుంజని యాతని కెరింగింప నాతండు కలభంబుపైకిఁ గమకించు మృగేంద్రుచందంబున మన సమీపంబునకువచ్చి యేమిచేయునోయని డెందంబు సందియంబొందుచున్న యది, యాతని కోపంబునకు మనమోపజాలము. పూజ్యంబగు సాంబ్రాజ్య విభూతి సమ్మౌనీంద్రునిచే వినాశంబుగాక యుండునే. (అనునంతలో మునీంద్రుండువచ్చిన)

హరి. మునిపుంగవా! యభివందనం బొనరించెద ననుగ్రహింపుడు.

విశ్వా. రాజాధమా! మాచేపంపబడిన మతంగకన్యకల జుట్టుపట్టి కొట్టి తిట్టి కుంతంబులచే పొట్టి యట్టిట్టు తెరలనియ్యక పొట్టకొవ్వున నిట్టులొనర్చితివి, అరే దుర్మార్గా? కోవివచ్చిన వాడిముఖులనీరీతి



మేరమీరి దూరనాడుట మేరయటరా, మన్మహోగ్రకోప దందహ్యమానంబున నీ సంపదలమట్టుబెట్టి నీచే నసృతంబాడించెద మత్తపస్సామర్థ్యంబు జూడరా దురాత్మా.

(అని కిరీటంబు నేలంబడదన్నిన)

హరి. మునికులావతంసా! నవరత్నస్థగిత కాంచనమయంబగు మత్కిరీటంబు దన్నుటచే మీమృదుపదాబ్జంబు నొచ్చెనోయని నామనంబు మిగుల విచారంబు నొందుచున్నయది, దాసుండనగు నాయపరాధంబు సహించి రక్షింపుడు.

విశ్వా. ఒరే క్షత్రియకులాధమా! లోకంబున నృపులు వేటాడుటయరుదే నీమదోద్రేకంబున మాయారామంబునకువచ్చి జంతు సముదయంబులద్రుంచి యంతబోవక మత్కుమారీ రత్నంబుల నవమానంబొనరించితివి. పాపాత్మా యొక్క పాదంబునొవ్వనేల నీచే జేయంబడిన కృత్యంబులకు సకలాంగంబులు నొచ్చె. రాజాధమా! చంకదుడ్డును శరణాధికాయు ననెడిమాట మాయెడ తథ్యంబయ్యె. మునీశ్వర బాధకంబగు నీదుష్టచారిత్రంబు మాకు తేటతెల్లంబయ్యె.

6440

హరిశ్చంద్రుడు (దుఃఖముతో)

క. నాపైనికినుకజెందకు! నీప్రాపేగోరినాడ నిక్కముగనునే
పాపాత్ముడనపరాధిని! కావనవరబ్రోవవలయుతనయునివగిదిఁ!

విశ్వా. హరిశ్చంద్రా! నీప్రియస్తోత్రంబునకు సంతసించి శాంతింబొందితిని నాయనుంగుకూతురులగు నిమ్మతంగాంగనల నీవునుఁజేబట్టి గట్టిగ నెలితివేని గావట్యంబులేక నిన్నుఁగాంచెద. నిమ్మానవతుల నాదరణనఁ వివాహంబుగమ్ము.

హరి. మునిశ్రేష్టా! ఉత్తమక్షత్రియ కులంబునఁ బుట్టి మతంగకన్యలఁ వరించుట మేరయగునే, యిట్టి కులవిరోధంబగు కృత్యంబు జేయంజాల.

విశ్వా. రాజకులవిభూషణా! నేజెప్పిన కార్యంబుకు కొదంబడితివేని ని న్ను జిరకాలంబు పూజ్యసాంబ్రాజ్య సౌఖ్యంబుల నోలలాడించి యీశరీరంబుతో జంభారిపురి కనిపెదర జూతుము.

హరి. మునివరేణ్యా! మత్కులాచారమెడలి యమ్మాలవనితలంగూడి సాంబ్రాజ్యవైభంబును గీర్వాణలోక సౌఖ్యంబయినను యేనొల్ల మద్రాజ్యంబైనను వర్జింతు మీరింత జెప్పనేల.

విశ్వా. క. భూవర యట్లాగాక
నీ వసుధనుదారబోయు హితమతితోడన్
వేవేగమిపుడు నీవును
భావజరిపుయాన మారు బల్కననిచటన్॥

హరిశ్చంద్రుడు, (భయకంపితమానసుడై.)

సీ. మునివరమీకోర్కె ముదముతోనొసగుట కన్ననుపేరద్దిగలదుమాకు పూజ్యసాంబ్రాజ్యంబుబూనంగగోరుట నాకుసంతసంబయ్యె బ్రాకట నిన్న మొన్నటిదాక నేర్పనమీరలుయేలితిరీరాజ్యమెవరిదిపుడు(ముగ గానమీసామ్మనుమానుగానేలుడు నన్నునిమ్మననేలనయముతోడ॥
తెల్లముగ మన్మనశ్శుద్ధి దెలియగోరి
యడిగితిరిగాక తనుకేలయస్థిరంబు
నైనయిమ్మహీరాజ్య సుఖానుభవము
మీమనంబున గోరిన మేలుమాకు॥

విశ్వా. హరిశ్చంద్రా! నీబూటకంపు మాటలాడుట మాతోడనా ము ల్లోకంబులయందలి సత్యవంతుండవని పేగొందినాడవని విందు, నిపింత మిథ్యాలాప శీల తారతుండవని యేనెరుంగ, మున్నీవు పూజ్యసాంబ్రాజ్యంబానంగెదనని నుడివినసుడువులు బొంకయ్యె జాల్లుచాలు వేయుమాటలేల.

చంద్ర. (హరిశ్చంద్రునిగాంచి)మనోహరా! యీజటిలు డొనరించెడు క పటకృత్యంబులను నురిలోనందగిలి పొరబడితిమింకయొండుదలం



పేల మీరెటులబలికినను యిటబొంకయ్యెడుగాక యొండు బలు కక ధైర్యంబుగీలించి యిమ్మహీరాజ్యంబాతనికి ధారాపూర్వక ముగా నిడుండు మున్ను బలిచక్రవర్తి వామనమూర్తికిభూదా నంబొసంగి యశోవిఖ్యాతుండుగాడే, క్షత్రియులకు కీర్తిసంపా దించుట పరమధర్మంబు సందియంబొందకుడు.

హరి. హృదయేశ్వరీ! నీవువచించినటుల మనరాజ్యప్రపంచంబు నమ్మ హాఋషికి ధారాపూర్వకంబుగనొసంగెద, పావనోదకంబు సువ ర్ణకలశంబున దెప్పింపుడు.

(అనిహరిశ్చంద్రుండు విశ్వామిత్రు పాదయుగళంబుగడిగి యతనిగాంచి,)

శ్లో॥ మహీసుర సురక్షేత్రై ర్వినా సర్వంచమేదినీ
ప్రయచ్ఛామిమునేతుభ్యం మహాంసర్వాబ్ధిమేఖలా॥

మునీంద్రా! దేవబ్రాహ్మణ క్షత్రియాదులు విన సమస్తయిళ్ళ ర్యాది ధరాతలంబు దానోదకపూరితంబుగా తమ పాణితలంబున దారబోసితి గ్రహింపుడు. (చంద్రమతినిగాంచి) సఖీ! మనమీ ముని యాశ్రమంబున కరుగుదెంచుట కిట్టి యాపదల్ సంభవంబయ్యె,నిచ టనుండ నింకేమిసంభవించునో, గాన మన యయోధ్యాపురంబున కేగుదము లెమ్ము.

(ఇట్లుహరిశ్చంద్రుండు సతీసుతయుక్తంబుగా నయోధ్యకుజేర నం త మరునాడు నద్ధరణీశుండు సభాసీనుడై యుండ విశ్వామిత్రుండుజనిన)

హరి. మునివరేణ్యా! యభివందనంబొనరించెద.

ముని. హరిశ్చంద్రా! కళ్యాణ్ కళ్యాణ్.

హరి. తాపసశ్రేష్ఠా! సామంత బంధుమిత్రామాత్య కవి నట గాయక వైణిక వైతాళిక విద్వజ్జన పరిహాసక రథగజాశ్వ భవవర్గంబు లును భాండాగారాది సర్వం సహా పూజ్యసాంబ్రాజ్యంబు ము ద్రికాదులతోడన్ గ్రహించి సింహాసనాసీనులై రాజ్యాధి పత్యంబువహింపుడు.

విశ్వా. హరిశ్చంద్రా! అలాగే గ్రహించితి, యీభూమికి యధిపతినయిన నేనుధరింపదగిన భూషణంబులు నీకేల నాకొసంగుము.

హరి. మునివరా! అటులనే నొసంగెద గ్రహింపుడు. (సర్వభూషణంబులునిచ్చును.) సచివ సామంత కింకర జనంబులారా ఇమ్మహీచక్రంబెల్ల నీకౌశికునకు ధారాగ్రహితంబు జేసితి లోకంబునకు మీకు నేలిక యీకౌశికమునివర్యుండు, యీతని పదవనజంబులుగొల్చి భక్తితాత్పర్య వినయంబులతో నీతనిఁ గొలువుండు యింక యేను సుతసతీ సహితంబుగా విపినభూముల కేగెదము మీమనంబుల మమ్ముల మరువకుండుడు. (విశ్వామిత్రునిజూచి) గాధినందనా! ఏను తమయనుగ్రహంబున సుతసతీ యుక్తుడనై యిల్లువెల్వడి పురవరంబువిడచి మీపాదపద్మంబులు భక్తినిస్మరించుచు యరణ్యంబుల కరుగుచున్నవాడ యభివందనంబొనరించెద ననుజ్ఞ యొసంగుము.

విశ్వా. ధరణీవరా! మును మేము యజ్ఞార్థం బడిగినధనంబు మాకీకనే పోవంజూచెదవు. యిది నీవంటి సత్యసంధులకు వివేకంబె, యేను మరచినను నీవు దలంపవలదే. ద్రవ్యంబుయెడ నింతదురాశయేల ఋణంబుదీర్చక పోవుట గుణంబుగాదు. బ్రాహ్మణ ధనం బపహరించిన పాపంబు బ్రాపించకుండునే, ప్రమాదవశంబున సర్వంబుఁ ద్రొక్కి నదిగరువకుండునే, విప్ర ద్రవ్యాపహారణం బట్టిదియని నమ్ముము. సత్యంబు మరచి కల్మషంబునొందకుడు.

హరి. మహాత్మా! మదీయ ఘనతర రాజ్యసంపదలయం దిసుమంతయైన గాచక సర్వంబు తమకర్పించితి. నంత దనివినొందక యిట్టి క్రూరవాక్యంబులు బలుకందగునా, యెందుతలంపులుమాని భక్తిచే నీయడుగులంగొల్చి యశోధనుండయ్యెదనంచు యేనున్నవాడ. అట్టి నాయెడ మనంబున ఘనంబగు కృపవహించి యిట్టి నాపై నప్పుబెట్టుట మీకుంబాడిగాదు, నింకదృష్టిబొందడు.



విశ్వా. క. మును నాకొసఁగఁ వలసిన
ధనమిపుడే గోరనీకు దగునా మది ని
ట్లనుమానించిన దప్పదు
ఘనముఁ ద్రవ్యంబొసంగి కానకుజనుమా.

హరి. మానికులావతంసా! తమరింత సంశయంబు నొందనేల, నన్నుందూర మీకు మేరగాదు. మద్వాక్యదత్తంబగు ధనంబు మీకు త్రింశద్వాసరంబులలో రవిచంద్రులసాక్షిగా మీకొసంగెద. నట్లొసంగనేని మమ్ముల క్రమంబుగవిక్రయించి మీధనంబు అంతయుగొనుండు.

విశ్వా. మానవేంద్రా! మీకటులొనర్చెదరేని యేనొడంబడెద. నింకొక్కవిశేషంబుజెప్పెద నెద్దియనిన, యిదిమొదలీవు సముపార్జించిన విత్తంబు నన్నపానాదులు నిమిత్తంబు వ్యయపరచందగదు.

(నక్షత్రకునిజూచి రహస్యముగా)

విశ్వా. ప్రియశిష్యా నక్షత్రకా! నీవు హరిశ్చంద్రువెంటంజని వివిధమాయాప్రకారంబుల పరుషభాషణంబుల కోపోద్దీపితమానసంబున కఠినవృత్తివానినదల్చుచు వెనువెంటంజని యాయానెలవుల నాతండార్జించుధనంబు లేశంబయిన వ్యయంబుచేయనియ్యక రేలునఁ బగలును వానినెడబాయక నిరంతరంబుపథపరిశ్రాంతంబులఁ గుందించి క్షుత్పిపాసా పరవశత్వంబునొందించి మానసంబుదూలించి చిత్తచంచలంబుగావించి యనేక బాధల నొందించి త్రింశద్వాసరంబులలో మద్ధనంబొసంగుమని బాధించుము, అట్లొనర్చిన నాతండు సాకుమార్యుండుగాన బాధలకోర్వంజాలడు వానినిఁ సుఖంబునొందనియ్యకుడు.

(రాజువంకంజూచి ప్రకాశముగా)

విశ్వా. రాజా! యీనక్షత్రకుండు మత్ప్రియ శిష్యుండు వీని నీవెంటఁబుచ్చెద, వీనింగొనిచని మదీయ రాజ్యసంబంధగ్రామంబుల

నిపుధనంబార్జించక యెచ్చోనైనఁ ద్రింశద్వాసరంబులలో మద్ధనం బొడగూర్చి వీనిచే నొసంగిపంపుడు. యేను వీనిరాక నిరీక్షించుచుండెద యతండు బహుసుకుమారి, వీని నెట్లు గొనిపోయెదవో బహుజాగ్రత.

హరి. మునివర్యా! వినుండు. యేను మద్రాజ్యంబు తమకొసంగినపుడు దేవబ్రాహ్మణక్షేత్రంబులు విన తక్కిన వొసంగితిని. యేనిప్పుడా ప్రదేశంబులయందలి ధనంబార్జించి తమరుణంబు దీర్చెద. మన్మనంబు సంతాపంబునొందింపకుడు.

(అనిన నక్షత్రకుండు హరిశ్చంద్రునిజూచి)

నక్ష. నరేంద్రా! మావిశ్వామిత్రుని ఋణంబుదీర్చుట కిట్టి యాలస్యంబు నీకేల లెమ్ము పోవుదము.

(హరిశ్చంద్రుడు చంద్రమతినిఁ గని)

దరువు- జంఝూటిరాగం - ఆదితాళం.

రాణిచంద్రమతీ- వనభూమికి- పోవుదమిపుడీ- భూసురుతోడ॥ రా.
నీవిథిగనుచుట- కేమియుదోచదు- యీవసుధకునజ- డీగతివ్రాసె॥ రా.
యింతదుర్దశమన- కిప్పుడగల్గెను- యింతిరో కాశీ- యీశునిగొల్వ॥ రా.
చూతకేతకివన- ప్రాంతముగడచి- ఖ్యాతిగపార్వతి- నేతనుజూడ॥ రా.
యిలను వెలయు పే-ర్కలపురినిలయుడు- చలముననేధింప-సాగెనుమనల.

(యిట్లు భర్త్రీపుత్రనక్షత్రసమేతుండై వనంబునకరుగుచు)

హరిశ్చంద్రుడు, (తనలో)

సీ. వాడనమాల్యంబు వీడిన క్రొమ్ముడి పైటకొంగునుజార పదము విడుచు
సూర్యాతపంబున సొక్కుచు ఘర్మబిందువులును జారగా దూలిదూలి
నిజపుత్రుచంకనునిడుకొనినదభంగ జాలంగ తొట్టిన భయకష్ట
మిట్లుజూచుచు నేను రొట్లు సహింతును ఏమి చేయుదునింక నవతుగలదు



తైవమునుదూర బాధియే ధరణిలోన
తాపనుండిటు నావిూద తాపసింధి
యిట్టికష్టంబు ఖాల్పత నిపుడు చేసె
గాన నాకిట్టి దుర్దశ గల్గెనహహ॥

హరి. చంద్రమతీ! నావలన నీకిట్టి దుస్తరంబౌ కష్టంబు ప్రాప్తంబయ్యె యీమునివరు కపటకృత్యంబు లింత జేసె యిప్పుడు నేనేమి చేయువాడ. రాజ్యంబు వదలి యరణ్యంబులందిట్టి యిడుములు బడవలసె వేరొక్క భాగ్యశాలికైన పురుషసింహునకు భార్యవైనయెడ సుఖింతువుగదా కోమలీ.

క. నలినాక్షి సౌఖ్యసంపద । విలసిల్లెదవంచుజాల వేడుకపడితిఁ
లలనరొ విపినావాసము । గలనైనందలపనైతిగా యొకనాడుఁ.

చంద్ర. నాథా! నానిమిత్తంబు మీరిట్లు దురంతచింతాక్రాంతుండవగుటనేల మనుజునికి నీడచందంబున సతిపతికనుకూలయగుచు వెనువెంటంజనుట పతివ్రతలకు విధివంతంబు, సతులకు పతియే దైవంబనుట సుప్రసిద్ధంబుగదా, గావున నాకై చింతవలదు మనప్రియసుతుండగు లోహితాస్యుండును క్షుత్పిపాసాతపాదులచే మిక్కిలి డస్సియున్నవాడు. వానికష్టంబులకు మనంబు విచారంబునొందుచున్నయది. మనము సత్యంబునకై పుత్రునికిఁ గూడ రాజ్యంబులేకుండఁ జేయవలసె. అహహా! యేమి దైవచిత్రము, కావలసినకార్యంబు గాకందీరదుగదా అయినను ధైర్యం బవలంబించుటుచితంబె, మీరు ధైర్యంబణుమాత్రంబునుం విడువకుండు.

నక్ష. హరిశ్చంద్రా! యేనింక పిపాసాభరంబు సహింపనోప యేతలన .ఖిన్నుండనైతి, యింక నొక్కడుగైనం నడువంజాల, మార్గాయాసం

బునొందితి మచ్ఛరీరంబున ఘర్మబిందువు లుబుకుచుండె. నీవు మత్ప్రాణసంరక్షణాపేక్ష తత్పరుండవైతివేని కడుజవంబుననరిగి విమలశీతల జలంబులం దెచ్చి దప్పిక దీర్పుము.

హరి. భూసురాగ్రగణ్యా! యిచ్చటికిసమీపంబున నెచ్చోటనైనను జలాశయంబుగానంబడదు నేనేమి సేయువాడ.

చంద్ర. జీవితేశ్వరా!

ఉ. బాలకుమారుడీయెడను మందగతిన్ జనలేక దప్పిచే
హీనతనొందినాడకట యెచ్చటనైన జలంబు దేవరల్
గానన భూమియందునను గన్గొనుచుండుడు మీరలీయెడన్
భానుడు మందమాత్రప్రభల పశ్చిమసాంద్రము జేర బోయెడిన్.

హరి. హృదయేశ్వరీ! దాహంబుగొని నడువంజాలకుండు మునికుమారుని యేనెత్తుకొనివచ్చెద. నీవును మన లోహితాస్యు నెత్తుకొని రమ్ము. (అని యరుగుచుండ)

—( కృత్రిమమహాముని యాశ్రమము. )—

హరిశ్చంద్రుడు, (కృత్రిమమహామునినిజూచి.)

హరి. మునివరేణ్యా! నమస్కరించుచున్నాను.

కృత్రి. జయతు జయతు! భాస్కరవంశ పయఃపారావార రాకాసుధాకరా.

హరి. స్వామీ! దేవరవృత్తాంత మొక్కింత యెరిగింపవేడుచున్నాను.

కృత్రి. ఓయీ భానుకులప్రదీపకా? ఈ యరణ్యంబుననే మాకాపురంబు నానామంబు కృత్రిమమహామునియందురు. మీరాకయేను



యోగదృష్టిచే గనుంగొంటి నదియెట్టిదనిన, నీరాజ్యంబంతయు నొకమునికి దానంబొసంగి యాతని కియ్యవలసిన ద్రవ్యంబున కుపాయంబులేమిం జేసి పుత్రకళత్రంబులతో నమ్మునిశిష్యునితో యీఘోర దుర్గమారణ్యంబులకువచ్చితిరి. యిప్పుడా మునిశిష్యుండు బడలి దాహంబుగొని నడువంజాలనన వానికొని వచ్చుచుంటిరి.

హరి. మునివరా! తమరు సదమలాత్ములగుటచే నిత్తెఱంగెఱుంగంబడె సంతసించితి, ఈనక్షత్రకునికి సలిలంబొసంగిదప్పిక దీర్చవలయు.

కృత్రి. హరిశ్చంద్రా! యిచట జలాశయంబులు లేవు. మత్కమండలంబున జలంబు స్వల్పంబుగ నున్నయది. వీటిచే దాహంబుదీరదు యిచటికిసమీపంబున బహుశాఖలుంగల నొకవటవృక్షంబుగలదు యచట గోమతియనునదిగలదు శీఘ్రింబచటికరుగుడు యిటనుంటిరేని శాపంబొసంగెద.

హరిశ్చంద్రుడు, (నక్షత్రకునిజూచి)

క. అయ్యానక్షత్రేశ్వర! యియ్యెడగోమతికిజనియు యింపుగ మానవుడా
నెయ్యమునజలముగ్రోలియు! చయ్యనబోవుదమురమ్ము సర్వజ్ఞనిధీ.

నక్షత్ర—దర్వు - భైరవిరాగం - ఆదితాళము.

హరిశ్చంద్రమహారాజా-నా-కమితమైనదాహ- మయ్యెనయ్యయో. హ.
నడువబోతె నాచరణంబులుబహు- తడబడిప్రాణము తల్లడిల్లెను. హ.
పుడమిపేరుకల పూడిని వెలసిన- కడలిశయనుడగు- గిరిధరుసాక్షిగ.హ.

హరి. స్వామీ! తమరింతగాజెప్ప నేల రండుపోవుదము.

(అనినత్తటాకంబుదగ్గిరకుం జేరి యుదకపానం బొనరించి.)

హరి. చంద్రమతీ! సూర్యుండస్తమించె నీవును యీ నక్షత్రకుండును మార్గాయాసంబున మిక్కిలిడస్సియున్నవారలు యీరాత్రి కీ వృక్షంబుక్రిందవిశ్రమించి యలసటందీర్చుకొనుడు యేను జాగరూకుండనైయుండెద.

(ఇట్లుండ భేతాళుండు వృక్షాగ్రంబుననుండి క్రిందికిందుమికి.)

భేతా. వరేనరాధమా! మదధీనంబగు నీ వటమూల ప్రదేశంబున కేటికి జనుదెంచితివి, ఒరే దుర్మతీ! మదీయ దారుణాయుధంబులకు నిన్నుం బలిగావించెద రమ్ము.

హరి. వరే దుర్మార్గా! నీవెవ్వండవు యీయరణ్యంబు నీదియే, నీకింత దురాతిశయంబేల నాతోడ యుద్ధంబు జేయఁగోరెదవేని వేగంబ రమ్ము. కాదేని దొలంగిపొమ్ము.

భేతా. వరే రాజాధమా! నన్ను మార్కొనఁదలంచి దుర్భాషలాడుచుంటివి, ఇకను సైఁచుట కార్యంబు కాదు రమ్ము.

(ఇట్లు యుద్ధంబునకుండలవడి హరిశ్చంద్రుండు భేతాళునిఁ జంపుట.)

హరి. (నిద్రావరవశయైయున్న చంద్రమతిని లేపి.)

గీ. కమలనేత్రిరొ మనప్రాణగండమిపుడు
దప్పి బ్రతికితి మిదుగొ భేతాళునిచట
గొట్టివేసితి యాకౌశికునిరుణంబు
దీర్చవలె లెమ్ము పోదాము తెరవుబట్టి.

హరి. (నక్షత్రకుని లేపి) స్వామీ! సూర్యోదయం బవుచున్నయది లెమ్ము పోవుదము.

(నక్షత్రకుండు లేచి.)

దర్వు- జంఝూటిరాగము- ఆదితాళం.

నన్నెత్తుకోరా- నరనాథాగ్రగణ్య యిక. న
నన్నెత్తుకొనిరా- కున్నా నేనడువనోవ. న
నన్నుపిడనాడివరుగు- చున్నావుముందుబిరబిర. న
చెన్నూమీరగపదములు- చిరుబొబ్బలెక్కెజూడు. న
రారాయీకరుకురాళ్ళు- దారిని నడువలేను. న
పేరుకల్పూడివారినను- జేరిరక్షింపగలడు. న

చంద్ర. ప్రాణేశ్వరా! గాధిపుత్రునిపంపున నక్షత్రకుండు విత్తంబుకొరకు మనవెనువెంటనున్నవాడు. కాశీపురంబిచటికెంతదూరంబున్నయది యిటనాలస్యంబు సేయనేల యీయరణ్యంబులఁ దాటి శీఘ్రంబ కాశీపురంబునకుఁ జని ధనమార్జించి ఋషి



శికునిరుణంబు దీర్చవలయు, మనగడువు సమీపించివచ్చుచున్నయది. తడవేల, వేగంబ నక్షత్రకుని నెత్తుకొనిరమ్ము.

(ఇట్లు హరిశ్చంద్రుండు నక్షత్రకునియెత్తుకొని వచ్చుచుండ)

హరి. జీవితేశ్వరీ! నలుదిక్కులనుండి పెనుదావాగ్నిజ్వాల లావరించి యీయరణ్యంబుదరికొని వచ్చుచున్నయది, మనమెట్లయినం గానిమ్ము. యీమునికుమారు నెట్లురక్షింతు, యీతని జాగ్రతగా పాడి ధనంబొసంగి సమయోచితకాలం బతిక్రమించకుండా బంపుడని యగ్గాధిసుతుం డానతిచ్చె. యిప్పుడీతని కపాయంబు గలుగకుండా యేనెట్లు గాపాడుదు, యేనీయగ్నిజ్వాలయందు ప్రవేశించి దేహంబు విడచెద.

చంద్ర. నాథా! నామనవిగైకొనుడు. యిమ్మునికుమారుం డీదారుణాగ్నిజ్వాలలఁ జూచి భయపడుచున్నవాడు, వాని ప్రాణంబులుగాపాడవలయు యిందుకుపాయంబు వేరొండు గానంబడదు మీరలు పుత్రమునిశిష్యుల నిరువురఁ గాపాడుకొనుండు. తమరు ఈ మునిరుణంబుదీర్చి కీర్తిఁ బొందగలవారలు, గాన తమరీపావకజ్వాలలఁ జొరధర్మంబే, నావలన ప్రయోజనం బేమి. సందియంబొందక నాకనుజ్ఞనొసంగుడు.

(అనిబయలు దేరిన.)

లోహి. జననీ! తోడునీడయుంబోలె నిరతుణంబు చే బ్రతుకం జాలిన నన్నిటడించి నీవొంటరినేగుటధర్మంబే, కంటిరెప్పయుంబోలె నన్నుఁ గాపాడుచుండువారలింకెవరు, గాన నన్నుగూడఁ గొనిపొమ్ము.

చంద్ర. కుమారా! నీవు వెరవకుము. నాపాతివ్రత్యమహిమచే నగ్నిలో ప్రవేశించి సర్వభక్షకుని ప్రార్థించి మరలవచ్చువరకు నీతండ్రి వద్దనుండుము.

(అని చంద్రమతి అగ్నిచెంతకుంజని)

దరువు- రాగం- నాదనామక్రియ- ఆదితాళం.

పరమపావనతేజ- పావకరాజా- శరణురజితరూప- సకలకలాప. వ
నిరుపమగుణశీల- నేనినుగూర్చి- యరుదెంచితిని నెట్లు- నాదరించెదవొ. వ

మునికులచంద్రుని ఋణమును దీర్చెటి- జననాయకుని వేగకనికరమునగావు.
సదయాతతో నిన- పుత్రకుని బ్రోచి- పెదపనాతనయుని- ప్రియమున
బ్రోవుము. వ. (లోనంగుము. వ
ధర పేరుకలపూడి- నరసిజనేత్రుని- మానవకయుంటినాకు- వరము

చంద్ర. హే వీతిహోత్రా! మేమావన్నులమై పురంబువిడచి జాలిందూలి కాశీపురంబున కేగుచున్నవారము. గాన దయావరుండవగు నీవు నన్ను దహింపంజేసి యామునికుమారునిం బతిపుత్రులం రక్షించి మాగణంబోనంగుడు.

(ఇట్లు ప్రార్థించిన వైశ్వానరుండదృశ్యుండయ్యె నంత చంద్రమతి రాజుచెంతకుజనిన.)

హరి. చంద్రమతీ! నీపతివ్రతామహాత్మ్యంబు మహాద్భుతంబావహిల్లంజేసె. నీసుగుణప్రభావంబున నందరము బ్రతుకంగంటిమి. నీపవిత్రవర్తనంబు స్తోత్రంబుజేయ శతముఖాదులకుందరంబే యశోహానిం గాకుండనిమ్ము నీకుమారునిం బ్రతికించితివి. నీకారణంబున నిట్టియశోశుభంబులం గాంచితినింకదడవేల. మనమిటవెడలి కాత్యాయనీకృత్తివాసంబును సకలసంపద్విలాసంబునగు కాశీపురంబు ప్రవేశించి యాకౌశికుని ఋణవిమోచనంబు శేయందగు గాన శీఘ్రింబరమ్ము.

(ఇట్లు వెడలి హరిశ్చంద్రుండు కళత్రపుత్రవర్గంబుతో కాశీపురంబు ప్రవేశించి.)

గద్య. ఇది శ్రీరుక్మిణీ సత్యభామాసమేత శ్రీవేణుగోపాల చరణారవింద మకరందపానేందిందిరాయమానమానసుండును పరాశరవంశక్షీర పారావార రాకాకైరవప్తుండును సుకవిజనవిధేయుండును జోగయాచార్యపుత్రుండునునగు శేషాచార్య ప్రణీతంబైన హరిశ్చంద్రచరిత్రము - ప్రథమాంకము.

సమాప్తము.

---

శ్రీరామచంద్రాయనమః.



# హరిశ్చంద్రచరిత్రము

## ద్వితీయాంక ప్రారంభము.

(రంగము - కాశీపురము.)

హరి. వనితాశిరోమణీ! జాహ్నవింజూచితే, నిర్మలజలావహగాహనంబున లోకభీకరంబులగు మహాపాతకంబుల హరింపంజేయ సమర్థంబును, రంగత్తరంగకల్లోలనినాదంబును, కమలకల్హారసముదయ సుగంధితనివాసంబును కలహంస చక్రవాక బకమయూరక మకరకచ్ఛపాది జలచరాలయంబును, అతిపవిత్రంబునునగు నీభాగీరథిం గృతస్నానులమై గోపురమంటపప్రాకార సౌధవిరాజితంబును, వేదశాస్త్ర పురాణార్థ విశ్రుతంబును ధర్మార్థకామమోక్షప్రదంబును, సర్వజనాపన్నివారకంబును, కర్పూరధూపవాసనావిశేషితంబును, భక్తజనేప్సితార్థుండునునగు విశ్వనాథునిం దర్శించుదము రమ్ము.

(అని జాహ్నవీస్నానంబొనరించి విశ్వేశ్వరునిం దర్శించి)

సీ. జయభక్తమందార జయశత్రుజనదూర జయసద్గుణాధార శరణుశరణు
జయసత్కృపాలోల జయశైలపుత్రీశ జయమునీంద్రస్తోత్ర శరణుశరణు
జయజగదాధార జయమేరుకోదండ జయపాణిసారంగ శరణుశరణు
జయకల్మషవినాశ జయరక్షితసురేశ జయనిత్యకల్యాణ శరణుశరణు
జయరమానాథసాయక శరణుశరణు
జయవిరూపాక్షశితికంఠ శరణుశరణు
జయసరీసృపవరభూష శరణుశరణు
జయమహాదేవ విశ్వేశ శరణుశరణు.

కమలామనోహరిరాగం - ఆదితాళము.

కరుణించినన్ను బ్రోవరా- గౌరిమనోహరా
గౌరీమనోహరా- నమోనమో. క.
సనకసాదిమౌనివినుత- చంద్రశేఖరా-
చంద్రశేఖరా- గుణసాంద్రపురహరా. క.
నీదుపాదములనునమ్మితి- నీలలోహితా-
నీలలోహితా- నిఖిలసురనుతా. క.
ఇలనుపేర్కొలపురిని వెలయు- ఈశస్మరహరా-
ఈశస్మరహరా- భూతేశగావరా. క.

(యిట్లువినుతించుచున్న హరిశ్చంద్రునింజూచి నక్షత్రకుండుకోపంబున.)

నక్షత్రి. రాజా! నీవువాకృచ్చిన సమయవాసరంబులు గదియవచ్చె. కాలయాపనంబు జేయుటయే గాని, ఋణంబునకు దినుమంతయైనం దీరదయ్యె. యింకనిన్నదలసయ్యెను. మిమ్ములన్బాధించినగాని ధనంబొసంగనట్టులం దోచుచున్నయది. గాన నిమోమాటం బేల, మద్ధనంబొసంగుడు.

(అనిమెడకుత్రాడువైచి కాలికి బంధంచును.)

లోహి. (కన్నీరువిడుచుచు)

రాగము - బేహాగ్ - ఆదితాళము.

బాధబెట్టమీకుభావ్యమా ననుగన్నతండ్రిని. బా.
బాధబెట్టకు- గాధిసుతుడు- క్రోధమునను- వేధించుచున్నాడు. బా.
పట్టిత్రాడుతో- గట్టిశ్రమలం- బెట్టియేమాట- గట్టుకుందువు. బా.
మించిమమువే- ధించజోకుము- యెంచిమీఋణ- ముంచకిత్తుము. బా.
అయ్యాయికవిడు- మయ్యాశరణంటి- నయ్యాకరుణించ - వయ్యాయిమ్మహీ
ధరనుపేర్కొల- పురినిశివయు- వరదుడుమాపై- కరుణమరచె.



హరి. భూసురవరేణ్యా! నన్నిపుడీవుసంబంధించిన నేమిశేయఁగలవాఁడ, నాయందనుగ్రహంబుంచి నిలువరించిన మీఋణంబు దీర్చుకొనియెద. నింక కొంతకాలంబు సహింపుడు.

నక్ష. వరేహరిశ్చంద్రా! యింక జాగుశేయం దగదు "ఆలేస్యమమృతంవిషం" బను వార్యోక్తివినవే, నీవింతవర కాజించిన దొక కాసైనం గానంబడదు. యికనెట్లార్జించెదవు మత్కౌశికు నిఋణంబు పుడొసంగి యరుగుము, మదీయస్వాంతంబున కత్యంతరోషం బొడముచున్నయది.

చంద్ర. మార్తాండకులేశ! లోకాలోకంబులెల్ల నిత్యసత్యుండవనినిన్ను సన్నుతిశేయ భూచక్రంబెల్ల నపక్ర విక్రమ పరాక్రమంబున సమగ్ర యశోవిభవుండవై పరిపాలించిన నీవు మూఢునివిధంబున భ్రాంతివహించి చింతించుట భావ్యంబే, మీరిట్లు దీనతకు బారయ మేరగాదు. యీ మునికంఠీరవుండు మిమ్ముల బొంకింతునని కంకణంబు గట్టుకొనియున్నవాడు. యీనక్షత్రకుండు కినిసిమా ఋణంబు దీర్పుమని మిమ్మిట్లు పరుషభాషణంబులు బలుకుచుండనిని యేనెటులసహింతు, నిత్యసత్యభాషా విస్ఫూర్జితంబగు మీగౌరవంబునకు యణుమాత్రంబైనను గొరంత వాటిల్లనియ్యక యీగాథేయుఋణంబుదీర్పుటందుల కొకయుపాయంబుమీకు నేనెరింగించెద. నదివినుండు, ఒండువిధంబున మీఋణంబు దీరనేరదు. గాన నన్నువిక్రయించి క్రయధనం బాతనికొసంగిన యతనిఋణంబుదీరు. కొదువ ఋణంబునకు మరియొక యుపాయంబు గలదది మీవలనందీరు, నిందుకు నందియం బొందకుము మనోహరా.

హరిశ్చంద్రుడు (చంద్రమతినిజూచి కన్నీటితో)

ఉ. హాసరసీరుహాక్షి యిటులాడగ బాడియె నిన్నుమెట్లనే
బాసిజరింపనేర్తు పరివారము రాజ్యము గోలుపోయినన్
గాసియొకింత లేదునిను గాంచుచునుండుట చేతనాకిటన్
మోసముజేసె దైవమిక భూసురవర్యుడు దూరనాడుటన్.

చంద్ర. ప్రాణపతీ! నీవింతవిచారంబు నొందనేల, యాపదలొందినపుడు కులాంగననమ్మి యాపదవిస్తరింపంజేయుట పరమధర్మంబు భార్యనువిక్రయించిన పాపంబు బాపుకొనవచ్చును గాని మిథ్యావాగ్దోషంబుల్ బాయనేరికి సాధ్యంబుగాదను నార్యోక్తివినవే, సత్యవాచాన్వితునికి సమానుండొకండుగలడే. గావున నామీది మోహాతమః పుంజంబున్విడచి కీర్తివిస్ఫూర్జితంబగు సూనృత వాక్యసంపదల్ బొందుడు. మన కిట్టిదుర్దశ సంభవించుట పురాకృత దుష్కృతఫలంబుగాని వేరొకటిగాదు.

హరి. చంద్రమతీ! దాసదాసీజనంబులు పరిచర్యలుచేయ, సకలరాజకన్యలుల్ గొలువ. హర్మ్యవాటికలల్ క్రీడావిశేషంబులల్ విహరించుచు రాణివాసంబుననుండు నీకు నానిమిత్తంబున నిట్టిపాటువాటిల్లె. నేనేమి శేయుదు మనోహరీ!

నక్షత్ర. రాజా! యింక నాలస్యంజేల నొనరించెదవు. సత్యాలాపంబులు నిల్పుకొనదవేని యిక్కలుపకంతి యందు మోహభ్రాంతివిడచి రాజమార్గంబునకుల్ గొనివచ్చి విక్రయించి మద్ధనంబొసంగుము. కాదేని లేదనిజెప్పుము.

చంద్ర. నాథా! యిక్కఠినోక్తులు యేనువిని సహింపజాల, శీఘ్రంబ నన్ను విపణిమార్గంబునకుల్ గొనిపోయి విక్రయించి క్రయ ధనం బాతనికొసంగి సత్యవాక్యంబు నిలుపుడు.

(అనిన హరిశ్చంద్రుండు చంద్రమతి నంగడివీధికిల్ గొనివచ్చి)

సీ. రవివంశమునబుట్టి రాజ్యమేలినహరి శ్చంద్రుండనాపేరు సాధులార
గాధిసుతుడుగోరఘునయజ్ఞమునకు నేధనమిచ్చుటకును వాగ్దానమొసగ
కపటంబునవాదుఘన రాజ్యసంపద గ్గొనియాతడునుపూర్వధనమునా
దెమ్మనిబాధింప తెలివిద్దియును లేక సతినమ్మవచ్చితిహితవుగాను (కు
మీరలెవరైనయడుగనే గోరినంత
ధనమొసంగిననిచ్చెద తథ్యముగను
రండుయిచ్చటికివలయు వారలుగొనంగ
జాగుసేయంగవలదు సౌజన్యులారా.



(అనిబల్కు చండ కాలకౌశికుండను పేరంబరగు భూసురుండువినిపలని.)

కాల. హేపురుషశ్రేష్ఠా! యీనారీమణి నీస్వకులాంగన యగునో కాదోనని నామనంబున సందియంబొడమె,గాన నీసంగతి నిశ్చయార్థంబుగా జెప్పి యెంతధనంబునకిచ్చెదవో వక్కాణింపుము.

హరి. భూసురోత్తమా! నాపేరు సత్యహరిశ్చంద్రుం డనంబరగినవాడ, యిట్టినేను విప్రోత్తముండవగు నీయెడయనృతంబాడనేర్తునే,నామాటనమ్ముడు సందియంబువలదు, కోటినిష్కంబులకీనారీమణి నివిక్రయించెద. యిష్టంబేనిగొనుండు, లేనియెడల నిట్టిసహింపరానిమాటలాడకుము.

కాల. హరిశ్చంద్రా! నీవు యిమ్మహి ససత్యంబునకు పెరచికదా యిట్టి దారుణకృత్యం బొనరించుచున్నవాడవు, గృహిణినమ్ముటధర్మమే, అణుమాత్రంబైన మనంబున సంశయింపక యిప్పటికిల్ బొంకినతిల్ గొనిచనుటమేలు. కల్లలాడినంతమాత్రంబున కౌశికుండేమిజేయుగలడు. భార్యనమ్ముటకంటె బొంకుటయెక్కువపాతకంబుగాదు నామాటవినుము.

హరి. ధరణీసురా! యిట్టిముచ్చటలు నాముందర హెచ్చరింపకుడు, నీవంటిధనలోభ గుణపరతులకు యేతద్వాక్యంబు లుపన్యశింపదగుంగాక, యిచటల్ ప్రస్తాపింపక శీఘ్రంబతొలంగుడు.

కాల. భూమీవరా! నీకీసమయంబునకు కార్యానుకూలంబగు నుపాయంబే నెరింగించిన నదినీకుల్ ప్రతికూలంబయ్యె, నాపై కోపించనేల, నీసూనృతాలాపప్రభావంబునకు నామనంబాశ్చర్యంబుగలుగుచున్నయది, నీమనంబు సందియంబులేక నీసతినొసంగదవేని ధనంబొసంగదగొనుడు.

హరి. ఆలాగేనొసంగెద ధనంబొసంగుడు.

కాల. హేనారీమణీ! యింకనాలస్యంబేల చేసెదవు, నాతనిమీద నీకికమాకలేల, రమ్మపోవుదము. (అని శిఖబట్టిలాగును.)

హరి. భూసురా! నీవింత దుష్టస్వాంతుండవని యెఱుంగ, సౌకుమారి
యు దైన్యసమగ్రయు గద్గదకంఠియునగు నీసాధ్వి నిట్లు యవ
మానంబొనరించుట నీకు మేలుగాదు. గోవున్గొనినవాడు క్రేపువి
డచుట ధర్మవిరుద్ధంబు, గాన యిందు ప్రతిమానసుందరుండగు
యీనందను నొసంగెద, నంతియధనంబిచ్చి గొనిపొమ్ము.

కాల భూపాలా! ధనంబొసంగుటచే నీసతి మదధీనంబయ్యె. గాన నీవి
టులాడఁదగదు గోవున్గొనినవాడు క్రేపునకు వేరుధనంబొసంగుట
మేరయగునా? యేనికధనంబొసంగ, నీవిటుబల్కుట మేరగాదు.

నక్షత్ర. హరిశ్చంద్రా! న్యాయంబుదప్పుట పాటిగాదు. నీసుందరాంగిని
భూసురుని కొసంగునపుడు, యీపుత్రుండిద్ధనంబులోనివాడుగా
డు, వేరుధనంబొసంగినగాని యీపుత్రునివ్వననిమున్నా నీవువా
క్రుచ్చితివే, తేటతెల్లంబుగా నపుడీవు వచించకపోవుటచే నంద
నునితోడ నీయిందుముఖి యీతనికిఁ దక్కె నింక నీవేమిబల్కి
నను ప్రయోజనంబులేదు. గావున పుత్రునొసంగి నూరకుండుము.

కాల. సుదతీ! నీపుత్రునిఁ దోడ్కొని వేగంబరమ్ము.

హరిశ్చంద్రుడు (విచారముతో)

మ. అకటా నిన్నడబాసి నేనిపుడు నాహా నవ్విధిన్ సైతునో
వికచాంభోరుహనేత్రి చాతకము ప్రావృట్కాలమున్ గోరున
ట్లికనే నిన్ననగోరుచుండవలెఁ నింకేమి జేయన్ దగున్
వకరిన్ నేమననేల యావిధియిటుల్ వ్రాసెన్ లలాటంబునన్.

హరి. ప్రాణేశ్వరీ! పూజ్యంబగు సామ్రాజ్యంబు దొరగినను, యీము
నివరునిచే నట్టియాపద లనుభవంబయినను, నీవియోగంబులే
మింజేసి మనస్సంకటంబు లెవ్వియున్ దోచవయ్యె. మని జానికి
నీడయున్ బోలె వర్తించుచున్న మనమిరువురున్ నవ్విధి మొగ
బాపుచుండఁగదా కోమలీ. (అని దుఃఖపడును.



చంద్ర. ప్రాణేశ్వరా! సమస్తమునెఱింగిన దేవరవారే యిట్లధైర్యబడి వి
లపించుచున్నచో నాబోటిదాని గతియేమి కావలసినది. స్వామీ
దుఃఖమునార్చుకొనుడి.

ఉ. ఈవగిది న్విచారపడుటెందుకు మీరలు మాటిమాటికిన్
పాపపుదైవమిట్లు మెడబాపె మనోహర నేటితోడ సం
తాపముమానిమీమదిని ధైర్యముజెందుముమీకు ప్రమోక్షదన్
ప్రాపగుదైవమున్ మదిని ప్రార్థనజేయుచు నుండుమిత్తరిన్.

గీ. ధరనుమీఁదగునిత్య సత్యవ్రతంబు
నిలుపుదురుగాక యీయాపదలకుదలక
వలదు దైవముమనపాల గలగకున్న
యనృతమాడింతుమీచేత ననుచుయిపుడు
కంకణముగట్టుకున్నాడు గాధిసుతుడు.

హరి. చంద్రమతీ!

గీ. కమలనేత్రిరో నినుకాలకౌశికునకు
విక్రయింపగవలసె యుర్వీసురుండు
యెన్నివిధములబాధింప నున్నవాడొ
యెట్టిదుఃఖంబుగల్పించె నీశ్వరుండు.

హరి. గాధిసుతుండింకే మొనర్చిననుజేయనిమ్ము. యీతనికపటకృత్యం
బువలనగదా మనకిట్టికష్టంబు లొందవలసివచ్చె. అయినంగాని
మ్ము, నీవీభూసురోత్తముని వెంట ప్రియనందనునితోడంజని వారి
వాక్యంబుల కనుకూలంబుగా ప్రవర్తించుచుండుము. సుతునియె
డ ప్రమాదంబులేక ప్రియంబునన్ గాపాడుకొనుము.

క. యిందునిభాననసే నీ। సుందరవచనంబుమెపుచు జాతునొమరలన్।
పొందుగకలకాలముమది। గుందుచునుండంగవలసె కువలయమందున్।

కాల. యింపువదనా! మీరిచ్చట నాలస్యంబుసేయంవలదు శీఘ్రింబు
నన్మద్గృహంబునకు జనుదమురమ్ము.

(అని చంద్రమతిని లోహితాస్యునిం దోడ్కొని తనగృహంబునకుజని.)

కాల. ఆహా కలహాకంఠీ! యేనునీకు సేవకాకృత్యంబులొనరించుటకంగడివీధి నొకండు తనసతినమ్ముచుండ దానింగొని మనగృహంబునకు దోడ్కొనివచ్చితి. నీయిష్టానుసారంబుగా దీనిచేతంబనులు చేయించుకొనుము.

కలహా. నాథా! నీవిద్దాసినింగొనుట కెంతధనంబు వెచ్చంబు జేసితివి. యీబాలకుండెవండు, యిట్టికృత్యంబెందుకొనరించితివి. దాసికొరకు ధనంబు వెచ్చంబు సేయదగునా.

కాల. ఆహా సుందరాంగీ! యీనారీరత్నంబు రాజకన్యక సేవకా కృత్యంబులయందతి నేర్పరి సౌకుమారి, విధేయతగలదియునని దెలుసుకొని స్వల్పధనంబునకే యిబ్బాలుని తోడంగొనివచ్చితి. గాన నామీదంగోపగించి గమకించి, యిచ్ఛాసంభాషణలం దూరనాడకుము.

కలహా. దురాత్మా! నీవు స్వల్పధనంబునకుం దీనింగొనితినని బొంకులాడెదవు, నిజంబిదివరకేను వినియుంటి చిరకాలంబుండి నార్జించిన ధనంబంతయు పాడుజేసి, యీవగలాడినిం దెచ్చితినని నాతోడ నింత భయంబులేక బల్కుచున్నవాడవు, నిన్నుం దీనినింగోలచేతం బ్రహరించెద.

కాల. ఓసీ! నీపుణ్యంబుగాని నీమాటకునోరెత్తిమాటాడను. నానేరము మన్నించి దీనింగ్రహించి పరిచారకకృత్యంబులు గావించుకొనుము.

కలహా. కులుకులాడీ! ప్రత్యహంబు గృహకృత్యంబులొనరించుచు, నాకుం బాదంబులొత్తుచు, కురులుం దువ్వుచు, పువ్వులుముడుచుచు యివ్విధంబున నేనెప్పుడేమి వాక్రుచ్చిదలంచెదనో యప్పుడు నాకనుసన్నలచే తత్కార్యంబులం మెలంగుము.

(అని యివ్విధంబున కలహాకంఠిచంద్రమతిచేబనులం గొనుచుండెనంత.)

హరి. నక్షత్రేశ్వరా! యీధనంబుం గైకొని యావిశ్వామిత్రులవారికియ్యొనంగుము.



నక్షత్ర. హరిశ్చంద్రా! నీవొసంగిన ధనంబు నారోజుభత్యంబులకుం సరిపోయె. మునిధనంబు తెమ్ము. లేకుండెనేని సత్యంబుదప్పికొనుము.

హరి. భూసురా! యాగాధిసుతుండు నాతోడనిన్ను రోజుభత్యంబున కంపెనే యాతండు నాతోడం జెప్పియుండలేదు. గాన నూరక మిథ్యావాదంబులాడకుము.

నక్షత్ర. హరిశ్చంద్రా! నన్ను యామునివర్యుండు నీతోడంబుత్తెంచు సమయంబున రహస్యంబుగ నాకుపదేశంబు జేసినవాడు. యేనుభత్యంబులేక నీవెంటందిరుగ భృత్యుండనే, గాన మునిరుణంబు దెమ్ము. లేకుండెనేని నిన్ను బాధలం బెట్టెదజూడుము.

(అని చెయిబట్టియీడ్చిన.)

హరి. (దుఃఖముతో) మునికుమారా! నీవు నన్నిటుల గాసింబెట్టనేల, యేనసృతంబాడుటకొడంబడ యామునిరుణంబునకు నన్నువిక్రయించి క్రయధనంబుంగొనిచనుము.

నక్షత్ర. హరిశ్చంద్రా! మంచిది, ఆలాగేగావించెద, రమ్ము. అంగడివీధికి పోవుదము. (అని నక్షత్రకుండు హరిశ్చంద్రుని దక్షిణహస్తంబు సూత్రంబున బంధించి వీధివీధులం ద్రిప్పుచు.)

క॥ జనులారవినుడు ఈతని। మునిరుణమునకమ్మదలచిముదమునసిటకుం।
గొనివచ్చితెవ్వరైనను। ధనమిచ్చినవీనినొసగెదనుయిపుడరయుం॥

(అంతలో వీరబాహుండువచ్చి.)

వీరబా. విప్రవర్యా! యీతండేకులంబువాడు, యితనినామంబెయ్యది, యెందునిమిత్తము విక్రయించుచున్నవాడవు, నేను నియమించు కృత్యంబు లొనరించునేని నీవడిగినంతధనంబొసంగిగొనిపోయెద.

క్షత్ర. వరేచండాలా! యీతండు రవికులంబునం బుట్టిన యోధ్యాపుర నాయకుండై ప్రజాపరిపాలనంబుచేసిన హరిశ్చంద్ర చక్రవర్తి

తనరాజ్యంబు గాధినందనునికొసంగి రాజ్యహీనుండయ్యె. అంతకుమున్న విశ్వామిత్రునకు గొంతధనంబొసంగవలసియుండి దీర్చకుండిన యాముని తనరుణంబునకై యాతని విక్రయించి యాధనంబుగొనివచ్చుటకు నాకాజ్ఞయొసంగె. గాన నీతండు విధేయుండు, బనులయందు నేర్పరి యితండొసంగవలసిన దెంతయున గజంబుపై నెక్కి మనుజుఁడు గవ్వమీటిన నెంతయెత్తో నంతధనం బొసంగితివేని నీకిచ్చెదఁ గొనుము.

వీరబా. భూసురవర్యా! యీనభూవరుండు, యేను మాతంగకుల సంభవుండను, నేనునుడివినటుల, యీనబనులొనరించుట కొప్పుకొనెనేని మీరుగోరినంత ధనంబొసంగి యితనిఁ గొనిచనియెద.

హరి. వరే మతంగకులసంభవా! నీవువాక్రుచ్చినటుల యేనన్నిపనులొనరించుచుండెద. గాన, వారుగోరినంతధనంబొసంగి నన్నుఁగొనిచనుము.

(వీరబాహుండు నక్షత్రకునకు ధనంబొసంగును.)

హరి. మునికుమారా! మీ ఋణంబు సంపూర్ణంబుగాదీరెనుగదా.

నక్షత్ర. హే సత్యహరిశ్చంద్రా! నీవాడితప్పనివాడవు, మీఋణంబుసంపూర్ణముగా ముట్టినది.

హరి. నక్షత్రేశ్వరా! తమఋణంబుదీర్చితి. యభివందనంబొనరించితినని విశ్వామిత్రులవారికిఁ దెల్పుడు.

నక్షత్ర. మంచిది! హరిశ్చంద్రా నేను మాపురంబునకరిగెద.

(యని నిష్క్రమించును.)

వీరబా. (రాజుఁ దోడ్కొని స్వగృహంబునకరిగి.) సేవకా! వేవేగ గృహకృత్యంబులు శీఘ్రంబునదీర్చిపోయి మద్య పూర్ణఘటంబులుఁ మాంసభాండంబులుఁ గొనిరమ్ము.

హరి. (మీయనుజ్ఞఁగొనిచని వేగంబ వాటిఁగైకొని యరుదెంచిన[illegible]



వీరబా. పరిచారకా! యిపుడు మత్పాదంబులు నొచ్చుచున్న యవిగాన ఒక్కొక చరణంబు లొత్తుచుండుము.

(అనిన పాదంబులొత్తుచుండెను.)

వీరబా. హరిశ్చంద్రా! వినయవిధేయుడవై నీవొనరించు సేవకాకృత్యంబులకు యేనత్యంతసంతసంబునొందితి. నిపుడొకపని జెప్పెద వినుము. ఇవ్వీటఁగల పరేతక్షితి నావశంబైయున్నది. ప్రేమచే నీక యాధిపత్యంబొసంగెదఁ గైకొని వీరదాసుండను నామంబుచే నొప్పి నీముద్రఁ గైకొని, పరేతనికేతనంబునకరిగి, నిజకృపాణపాణుండవై భూతవ్రాతంబుల కధిపతివై న్యాయంబునఁ బరిపాలించుచుండుము.

హరి. మీరు సెలవొసంగినటుల ప్రేతనికేతనంబునకరిగి నిష్పక్షపాతంబునఁ బ్రవర్తించుచుండెద ముద్రికొసంగి యనుజ్ఞయిండు.

(యిట్లు హరిశ్చంద్రుండు ముద్రగైకొని ప్రేతభూమికరుగుచు.)

ఝంఝూటిరాగము - అటతాళము.

రామరామరామ- రామరాక్షసభీమ- రారసద్గుణధామా। రా।
పాకారిసన్నుత- భక్తుడనగునన్ను- ఈకరణిని జేసితే॥ రా।
పావనమతినెడ- బాపిడవనినీదు- పాదములనునమ్మితీ। రా।
నీచెట్టబట్టిన- రాచపట్టినినిట్లు- నీచునిపాల్ జేసితే। రా।
మానుగసర్వభూ- మండలంబునేలి- పీనుగలగాల్వనాయె। రా।
యెంతపాపమొగాని - యింతదుర్దశనాకీ - యెడసంభవంబయ్యెగా।
క్షితిపేరుకలపూడి- శ్రీనివాసుడునాకీ- గతిదెచ్చెనేమందునూ। రా।

హరి. అయ్యోదైవమా కమలామనోహరా భార్యపుత్రాదులనమ్మి స్మశానవాటి కధిపతియైన మాలవాని గొలిచి బ్రతుకనాయె నే నేమిసేయుదీశ్వరా.

ఇవ్విధంబున దుఃఖంపుచు హరిశ్చంద్రుండు

ప్రేత రాజ్యాభిషిక్తుండైయుండ.)

కాల. ఒరే లోహితాస్యా! నీవిట్లు రేయింబగళ్ళు పనులేమియుఁ జేయక నీజననితోఁ గూడి పొట్టనిండ మెక్కుచు వృథాకాలవ్యాపనంబు చేయుచుంటివి నీ యీడు బాలకులిట్లు వ్యర్థులై దిరుగుచున్నవారలే, యిది మొదలీవు యీడు బాలురఁ గూడి యరణ్యంబునకరిగి కుశపర్ణ సమిత్తులుఁ గొనివచ్చుచుండుము. అట్లు చేయవేని నిన్ను దండతాడనంబొనరించెద. (మెడబట్టి నెట్టును.)

లోహి. (కన్నీరు విడుచుచు.) తల్లీ! యిబ్భూసురుండు నన్ను బాలురతోఁ గూడి యరణ్యంబునకేగి కుశపర్ణ ఫలాదులఁ గొనిరమ్మని చెప్పుచు కష్టంబు జేయునివాని కన్నం బెవరు బెడుదురనుచును, నన్ను దండతాడితుఁ జేసె. యీ దెబ్బలకే నెట్లు సహింతు జననీ వీనింట నిట్టి యాపద నొందవలశివచ్చెను గదా దైవగతి నేమన వచ్చు తల్లీ.

చంద్ర. కుమారా! యీ భూసురుండు నిన్నరణ్యంబులకేగి సమిత్ఫలాదులు దెమ్మని చెప్పుట కెట్లునోరాడె. రాజనందనుల చేత గొల్వంబడు నీవు యీ విప్రాధముని గొల్చి, వీనికి నుకకులోఁ బడివుండవలశి వచ్చెను గదా, అహాహా, "దైవే బలే దుర్బలే" అను లోకోక్తి దబ్బరయగునే, మనమేమి జేయఁగలవారము. నిన్నరణ్యంబున కే నెట్లను పుదు, గౌశికుండింకేమి మాయలఁ బన్ను నో నే నేమి శేయుదు. పట్టభద్రుని కొమారుండవై కట్టెలాకులు నిమిత్తంబు గుట్టగుహలు దిరిగి జీవింపవలశివచ్చె గదా తనయా.

(అని దుఃఖపడును.)

క॥ ఎట్టి మహాపాతక మొడి। గట్టితిమో పూర్వమందు గావున నెకదా।
యిట్టివి కష్టములబ్బెను। కట్టిడిగు లేలనమ్మ కమలదళాక్షీ॥

చంద్ర. గానిమ్ము కుమారా! వారికి విధేయుండవై వర్తించునపుడు వారు గోరిన పనులు జేయకఁ దీరునే, పోయిరమ్ము. నీకు వియచ్చరాది శాటభూత దుష్టమృగ పక్షివ్రాతంబులచే నెభయంబునుఁ బొందకుండుఁగాక. (అని దీవించెను.



తల్లికొడుకు సంవాదం దర్వు.

జంఝూటిరాగము - అటతాళము.

అమ్మనిన్విడచినే - నాడు బాలురగూడి - యడవికేటులబోదునే॥ అ॥
పుత్రకయావిశ్వా - మిత్రుడు మనపైని - శత్రుత్వమిటుబూనెరా॥ పు॥
ఆకలౌతుందినా - కన్నమైనను బెట్టి - ప్రాకటముగ బంపవే॥ అ॥
తనయయాకలిదీర్చ - గలశక్తియుంటేని - తండ్రిని నెడబాతునా॥ పు॥
జాలిలేకనునన్ను - కాలకౌశికుడు యీ - బాలులతో బొమ్మనే॥ అ॥
జగతిపేర్కొలపూడి - నగధరుకృపలేమి - కగచాట్లపాలైతిమీ॥ పు॥

లోహి. బాలకులారా! నేను మీతోఁ గూడివచ్చెద, కుసుమసమిత్ఫలాదులఁ జూపుడు. (అని బాలురతోఁ గూడి వనంబునకేగి కుసుమ సమిత్ఫలాదులఁ గోసికొని పర్ణంబులకై లోహితాస్యుండు వటవృక్షశాఖఁ బట్టి వల్మీకంబుపైనెక్కిన నందుండు భుజంగంబు వానిఁ బట్టి గరువ నాతండు భూమిపైనఁ బడి మూర్ఛనొందిన.)

బాలకు. (వారిలో) ఒరే బాలులారా! యీ లోహితాస్యుండు పర్ణంబులకై వల్మీకంబెక్కిన సర్పదుష్టంబయ్యెగాబోలు, లేనియెడ వీడిట్లు మూర్ఛమునింగియుండుటకు గతంబెయ్యది. గాన తడవు శేయక వీని తల్లికెరింగింతము, రండు సోదరులారా.

(చంద్రమతికడకుం జని.)

కల్యాణిరాగము - ఆదితాళము.

వినుమోచంద్రమతీ - యీ వార్తను॥ వి॥
వనితరో సిప్రియు - తనయుడు వనముకు -
జనికుశ ఫలములు - చాలగగోశెను॥ వి॥

ప్రాకటముగవ - ల్మీకమునెక్కియు-
ఆకులుగోయద - ద్వీకరమయ్యెడ॥ వి॥
గరువగబాలుడు - ధరపైబడియెను-
పరువునదెల్పట - కిరుదెంచితిమి॥ వి॥
ధరనుపేరుకల - పురమునశేమయు-
వరదుడుమీాపై - కరుణమరచెను॥ వి॥

చంద్ర. హాకుమారా! హా లోహితాస్యా? (అని మూర్ఛిల్లుచున్నది.)

బాలకు. దేవీ! ఊరడిల్లుము.

చంద్ర. (లేచి) హా లోహితాస్యా!
నన్నొంటరిగా విడచిపోతివా కుమారా.
(అని రోదనముచేయుచున్నది.)

బాలకు. దేవీ! యిట్లు గతించినవానికై విచారింప నేమిప్రయోజనము. వానిపై ప్రేమవిడిచి ఊరడిల్లుము.

చంద్ర. గీ. హాకుమారకనీవు యడవికేగి
వర్ణాములుగోయబోయిన పన్నగంబు
యచటనుండియువచ్చెనో యవ్విధికిని
నీవుగనబడితివోనవ్య నీరజాక్ష.

(చంద్రమతి విలపించుచు కలహాకంటితో మొరలిడ.)

కలహ. మాయలాడీ! నీతనయు నచటనోదొంగలఁద్రోచి యరణ్యంబున పన్నగంబుబట్టి గరచెనని మెల్లెమెల్లెనకల్లయేడ్పు లేడ్చుచు కపట వృత్తిచే మాయమాటలిచటఁ బలికి పనులఁ విడచిపోవంజూచెదవు. నీబొంకులు నేనునమ్మను. నీవుజాణవనినాకుఁ దెలుసు. వట్టిశోకంబేల బొందెదవు, నీవు గావించుపనులు యింకెవ్వరొనర్చెదరు. చాలు చాలు, శీఘ్రంబున పనులొనర్పుము.



చంద్ర. తల్లీ! యీవేళ నన్నుకనికరంబుజూడకుము, చిత్తముఖ నొందుద లంపుమాని దయారసంబుంచి నాకుఁ బుత్రదానంబొసంగుము. నా కుమారుండు కాననంబున పన్నగవిషంబుచే నేరీతినున్నవాడో దెలియదు. నాకు శెలవొసంగుడు. యస్తమయంబయ్యె. నింక నేనేమిపను లొనరింపుదాన.

కలహ. సుదతీ! బాలురరోదనంబు మాన్పించుటకు ఫలంబులు దెమ్మని పంచిన భుజంగంబులుండు పుట్టలపైనెక్కడని నీతనయుని కెవరు జెప్పిరి. శరీరంబు బలిష్టంబగునటుల నశనంబుదిని క్రొవ్వియొడలెరుంగక, యిట్టిపను లెందుకొనర్చవలెను అందుకు నేనేమి సేయుదాన సాయంకాలకృత్యంబులు చక్కఁగఁదీర్చి నాచరణంబు లొత్తి యేనిద్రజెందిన యనంతరంబునఁ బోయి యరుణోదయంబునకురమ్ము.

(అని చంద్రమతి సాయంకాలకృత్యంబులుదీర్చి యాకలహాకంటి నిద్రబోవుతరి తాను గృహంబువెడలి యువ్వనంబునకుం జని లోహితాస్యునిఁ జూచి.

చంద్ర. (కుమారునిపైబడి) హా! లోహితాస్యా; నన్నెంతటి దుఃఖసాగరమునముంచిపోతివి కుమారా. 6440

జంఝూటిరాగము - అటతాళము.

అంగజసమరూప - మంగళకరభు-
జంగవిషంబున - జచ్చితివటరా॥ అ॥
తనయునిన్నడబాపె - దైవమిచ్చటను-
నను జూచెవారెవరు - నాతండ్రియొకనూ॥ అ॥
యెన్నినోములునోచి - నిన్నుగాంచితిరా-
నన్నుబ్రోచెదవని - నమ్మితిగదరా॥ అ॥

పాపతి వైనకల - భూములన్నియునూ-
చేపట్టినీపుర - క్షించెదవనుకుంటి॥ అ।
గాధినందనుడుయీ - కఠినముబూని-
వేధించసాగెని - వ్విధమునమనల॥ అ।
అవనీశ్వరుడున - న్నమ్మినగాని-
ప్రవిలముగకనుల - కుందువగానుంటి॥ అ।
క్షితిపేరుకలప్రాడి - శ్రీజనార్ధనుడీ-
గతిదెచ్చుటెరుగలో - హితసుకుమారా॥ అ।

క. బంగరునుయ్యేలలోపల। నంగనలందరునునునిచి నటునూచెడునీ
మంగళతరదేహంబి। బ్భంగినిజూడంగవలశె పంకజనయనా.

చంద్ర. కుమారా! సకలశుభ లక్షణలక్షితులగు క్షత్రియకులాంగనల
నేకులుండ యువలక్షణురాలనగు నాకుక్షియందేల బుడితివిరాత
నయా, నాపూర్వార్జితజన్మఫలంబిటులుండనీవేమి శేయువాడవు.

క. చచ్చినసూనునికైనే। నిచ్చటచింతింపనేల నినుదుదయించుగ
చిచ్చిడగవలయునుతునకు। చెచ్చెరకై వల్యపదము జెందుటకొరకై.

(అనిదలంచి పుత్ర్రునెత్తుకుని భూతభేతాళాది పిశాచగణంబుల కా
స్పదంబగు ప్రేతభూమికిజని, పుత్రశవంబటనునిచి శుష్కేంధ
నంబులం పేర్చి, యగ్నిదరిగొల్పనమగట్టి.) (విచారముతో)
హా ప్రియకుమారా! తొల్లిహరిశ్చంద్రచక్రవర్తి యంకపీఠము
పై నవమన్మథాకారుండవై కూర్చున్నప్పుడు పరమసంతోష భ
రితమానసినై చూచిన కన్నులతో నిప్పుడీక్రియ విచేష్టితుండవై
పండియుండ జూచుచుంటినికదా, హాలోహితాస్యా,

(యని విలపించుచున్న.)



హరి. భూతగణంబులారా! రుద్రభూమియందీ యర్ధరాత్రంబున నొక
నారీమణిరోదనంబు వినంబడుచున్నయది. గాననేనచటికేగి యా
వృత్తాంతంబరసివచ్చెద మీరిటజాగరూకులైయుండుడు.
(అని చంద్రమతికడకుంజని క్షితిని బడదన్ని) సాహసీ! నీవెవ
రవు. నీనామంబెయ్యది. నీవీయర్ధరాత్రంబున నిచటికి సుమం
తమైన భయంబులేక, యెట్లరుదెంచితివి, నీకిట్టియాపదసంభవిం
చుటకు గతంబెయ్యది, ఈబాలుండు మరణించుటకు కారణం
బేమి యీవృత్తాంతంబు సవిస్తరంబుగా నాకుం దెల్పుము.నిజం
బుబల్కవేని నిన్నుసహింపుటలేదు.

చంద్ర. నరవరా! యేనిక్పట్టణంబున నొక్క విప్రగృహంబున దాసీకృ
త్యంబునొనరించుచున్నదాన, యిదియునుంగాక నాభర్త రుణం
బునకై యేనువిక్రయింపబడి యాతని సత్యవాక్యంబు నిలువరిం
చితి. యీభూసుర సదనంబున నూడిగంబులొనరించుచుండ నా
విప్రుండు దయావిహీనుడై నాప్రియపుత్రునిం కుశసమిత్పుష్ప
ఫలంబులుదేర నరణ్యంబున కనిచిన నందుసర్పంబుచే గరువంబడి
మృతినొందె. వానికగ్ని సంస్కారంబులొనరింప నిప్రేతభూ
మికిం గొనివచ్చినదాన, నాపేరుహంససారియని యిపుడు వా
డంబడె, నిన్నుజూడ దయాసముద్రుండనియు ప్రేతభూమికాధ్య
క్షుండగు పురాంతకుండవనియు నాకుం దోచబడుచున్నయది.
గాన నీబాలునికి విషహరంబగు చికిత్సంజేసి నాకు పుత్రదానం
బొసగవలయునని ప్రార్థించెద.

హరి. సతీ! యేను భూతనాథుండనుగాను విషచికిత్సంజేయ, భిషగ్వ
రుండనుగాను వీరబాహుండనుగాను చండాలమనుజునకు భృ
త్యుండ నాపేరు వీరదాసుండ, నేను నారడొసంగిన ముద్రికం
గొని యీప్రేతభూమి పరిపాలనంబు శేయ వానియనుజ్ఞవడశి

ణుచట వసించుచున్నవాడ, శాసించినవాడు నీయిచట పుత్ర కళేబరంబు దహింపగ బూనితివి. అట్లొనర్చెదవగుచో, యీ వాడు దానవనినిన్ను మన్నించితినిగాని లేనియెడల శిరంబుఖండించెదను, నాకొసంగవలసిన మాడనిచ్చి యనంతరం బీకార్యంబొనరించ వలయు, అటులివ్వనియెడల నిచటనుండుట దగదుపొమ్ము.

చంద్ర. నరవరాగ్రేసరా ! నాయెడ నిట్టి ఘట్టిమాటలాడుట మేరగాదు, నేను నిరుపేదరాలను, గాసైనం చేత లేదు. నన్నిట్లుగవ్వబెట్టిన నేమి సేయంగలదాన, ఆపదయందున్న నన్ని సమయంబునఁ గాపాడ వలయు.

హరి. సుదతీ! శ్రీధరుచరణారవిందంబు లారాధించుటన్విడచి, కులకీర్తులఁ బాసి ఛండాలునికిఁ భృత్యుండనై యీపరేతభూమికాధ్యక్షుండనై నీచవృత్తిఁ మెలంగు నాకు దయారసంబు గలుగునే, మత్స్వామియగు వీరబాహునాజ్ఞ నతిక్రమింపదగదు. గాన చేతంగాసులేకున్న నీకంఠంబునఁ గానంబడు మంగళసూత్రం బొసంగుము. "జాతస్యమరణంధృవం" అను నార్యోక్తివినవే, యెల్లశరీరధారులకు మరణంబునిశ్చయంబు బలుమారు నీకుమారునిఁ దలచి నేడ్చిన ప్రయోజనంబేమి.

చంద్ర. భూవరా! నాపాతివ్రత్య మహిమావిశేషంబున మద్గళంబున నొప్పుచున్న మాంగల్యంబు మత్పతికిందక్క నొరులకు గానంబడ దుగాన, మీరు సూర్య కులావతంసుండవగు హరిశ్చంద్ర నరేంద్రుండనుటకు సందియంబులేదు. రాజపురందరా! మనమిరువురకిట్టి దురవస్థసంప్రాప్తంబయ్యె నున్న నీయంకపీఠంబున నిద్రించినయట్టి నీపుత్రుండగు లోహితాస్యుండిచ్చోట దీర్ఘనిద్రం బొందుచున్న వాడు, అహహా కాలగతి కెవ్వండు ప్రాపెవ్వ

(అని దుఃఖించుచుండ.)



సీ. తిరయరుద్రావని యయోధ్యయే నీకు వరభూతములు మంత్రి వరులెనీకు। జంబుక భేతాళ స్వరనినాదంబులు ఘనగాయక ప్రసంగములె నీకు । శారవివయ్యంబుల గుంపులెల్లను వేడ్క బటసమూహంబులె బరగనీకు। నవరత్నసింహాసనంబె నీకిమంచ నరకుంతలములు చామరలె నీకు

అహహా యేమనిజెప్పుదు నయ్యదైవ
ఘటనదప్పింపనేరికి గలదెగాధి
తనయుడొనరించు కపటకృత్యంబులింతొ
జేసెయనుభవమొందక జేయుదేమి.

హరి. (అనియిట్లు చంద్రమతి శోకించినఁ గనుంగొని హరిశ్చంద్రుడు పుత్ర కళేబరంబుజూచి మూర్ఛాగతుండై లేచి.)

మాంజీరాగము - ఆదితాళము.

యేమి సేతుదైవమా - యీసుతు నెడబాసి-
భూమిలోనావంటి - పుణ్యహీనులు లేరు॥ యే॥
మితిలేకనలవిశ్వా - మిత్రుండింతటిపాప-
మతియై వేధించసాగె - క్షితితలమందున॥ యే॥
పాపిష్టిపాముపీని - ప్రాణముల్ దీయను-
యేపారగనిపెట్టె - యెందుండిముట్టెనో॥ యే॥
వరపేరుకలపూడి - వాసుకునాపైని-
కరుణమరచియింత - కఠినముబూనెనో॥ యే॥

చంద్ర. (హరిశ్చంద్రునిజూచి.) నాథా! సుతునిపైబర్వు మోహలతావితానంబు మనోజ్ఞానంబను పవిత్రంబుచేగోసి ధైర్యంబవలంబింపుడు. నింకఘనతరంబగు శోకవహ్నింబడి గ్రాగుట కిదిసమయంబుగాదు. ఆపదలు కలకాలముండవు, ఆపరమేశ్వరుం డెన్నటి

ద్రైన నుద్ధరింపకమానదు, గానకాగలకార్యంబు నిర్వహింపుము, యేనింక నినుడుదయాద్రికిఁ జేరకమున్నె త్వరితగతిఁ జని స మయోచిత కృత్యంబులు జరుపకున్న యావిప్రు గృహిణి నా మీఁదఁ మిగులఁగోపించు.

హరి. కాంతా! యేనేలినవాని యాజ్ఞదప్పి వర్తించితినేని సత్యంబుద ప్పు. యిప్పనికేనెట్లు నొడంబడవచ్చు, యికనొండు మాటవల దు, నీవు యద్ధాత్రీసురుని గృహంబునకుఁ జని నాతనేరీతినైన నడిగి మాడనుగొని శీఘ్రింబిచటికిరమ్ము.

చంద్ర. మనోహరా! నీనిత్యసత్య ప్రభావంబున కచ్చెరువందితి. మీర నుజ్ఞనిచ్చి నటుల నేనచటికరిగి మాడఁగొనివత్తు నంతవరకు నీసుతునిఁ గాపాడుచుండుడు.

(అని చంద్రమతి నిష్క్రమించును.)

విశ్వా. (నిరుప్రరతస్కరులఁ బిలచి.) చోరులారా! మీరీక్షణంబుననేగి కాశిరాజపుత్రుఁ జంపి వానియాభరణంబులఁ గొనివచ్చి పు రవీధిఁ వచ్చుచున్న హరిశ్చంద్రుని సతియగు చంద్రమతివద్దఁ బెట్టి రాజతలవరుల కప్పగించి మీరుజనుండు.

(అనినచోరులు కాశిరాజు గృహంబున దాదిశయ్యఁ బవళించి యున్న రాజకొమరునింజంపి యాయాభరణంబులం గొనివచ్చి చంద్రమతినిం గని.

చోరు. ఓతల్లి! నీవెవ్వర వీయర్ధరాత్రంబున నొంటరిగా నిటువిచా రంబు నొందుచు నెచటి కేగుచున్నదానవు.

చంద్ర. యేను కాలకౌశికుడను విప్రగృహంబున పనులొనరించుచుండ నావిపృుడు మత్పుత్రుని యరణ్యంబునకనిపి పణంబులఁ దె మ్మనిన, వాడు నరణ్యంబునకేగి యాకులు గోయుచుండుతఱి భుజంగదృష్టుండై మృతినొందె, నావృత్తాంతంబువిని యేనచటి కరిగి వాని కగ్నిసంస్కారంబు లొనరింప ప్రేతభూమికేగిన నట దబ్బ్రాసంగినంగాని యాకార్యం బొనర్చుట కర్హంబుగాదని న చటివార లుడివిన యేనందు నిమిత్తంబు విప్రుసదనంబునకు బో వుచున్నదాన.

చోరు. సహోదరీ! నీవింతవంతగుందనేల, యిద్ధనంబుం గొనిచనుము. (అనిచోరుల నగలుమూట నాచంద్రమతి వడినుంచి చనిన రా జభటులు చోరులవెదకుచువచ్చి చంద్రమతినింగని యాభరణం బులు వడినుంచుటంగని యానతినింబట్టి కాశిరాజు కడకుంగొని చని యెదుటఁ బెట్టి.)

భటు. రాజేంద్రా! యిద్దురాత్మురాలు తమ మందిరంబున నిదురంబో వుచున్న తమసుతునిఁ జంపి యాభరణంబులఁ గొని చనుచు న్నయది గాన దీనిఁ బట్టిదెచ్చితిమి.

కాశి. (దుఃఖముతో) భటులారా! యిట్టిక్రూరకృత్యం బొనరించిన మ హాపాతకిని శిరచ్ఛేదనంబొనరింప శలవొసంగితిగాన యాదురా త్మురాలిఁ వీరబాహుని చెంతకుఁ గొనిపోయి యేనొసఁగిన యా జ్ఞం జెప్పి యప్పగించుడు.

(భటులు చంద్రమతినిఁ గొనిపోవును.)

భటు. వీరబాహా! కాశిరాజు కొమరునిఁ ద్రుంచి యాభరణంబు లఁగొనిన యిద్దురాత్మురాలిని శిరచ్ఛేదనంబొనర్చుటకు నీకడ కుంబంపిరి.

వీరబా. తలవరులారా! యిమ్మహాపాతకిని శీఘ్రింబుగ మదీయభృత్యుం డగు వీరదాసుకడకుం గొనిపోయి శిరచ్ఛేదనం బొనరింపుడని చెప్పుడు.

(భటులు చంద్రమతినింగొని రుద్రభూమికాధ్యక్షుడైన వీరదాసునిం జూచి.)

భటు. వీరదాసా! మాయేలికవాడగు వీరబాహుండు యిద్దురాత్మురా లింతలద్రుంచుటకు నీకడకుం బంపినవాడు అయ్యాజ్ఞ శిరసావహించి శీఘ్రింబదీనిఁ శిరచ్ఛేదనంబొనరింపుడు.

హరి. (తనలో) ఆహా దైవమా! ఉత్తమక్షత్రియ వంశంబునంబుట్టి పూజ్యంబగు సాంమ్రాజ్యంబుబోనాడి, ఇప్పట్టణంబు జేరి, మాలవానికింభృత్యుండనై వర్తించవలశెంగదా, యెన్నినీచపురుషుల కుఁ లోబడినను తుదకీ నారీశిరోరత్నముఁ దునుమంగవలశె "నొసటంవ్రాసిన వ్రాలుకన్నగలదా నూరేండ్లు చింతించినఁ" అను నార్యోక్తిఃథిఁ గడువనెవరివశంబు, స్వామిద్రోహంబు జేయుట సత్యంబుగాదు.

చంద్ర. వసుధాధిపా! మీకెరుంగని ధర్మంబెందుగలదు, పావనచరిత్రులగు సత్యసంధులకు స్వామిద్రోహంబొనరించుట మేరగాదు. మున్ను వైకుంఠంబున రమావల్లభుండు భూదేవింజూచి పాతకంబులలో స్వామి ద్రోహంబు మహాపాతకంబనిజెప్ప, ద్రావతి "శ్లో॥ ప్రాణమేవపరిత్యజ్య మానమేయాభిరక్షతు" అనిచెప్పెఁగాన కాశిరాజు కుమారునిఁ దునిమితినని నింద నొందిన యేను శిరచ్ఛేదనంబున కర్హురాల, గాన నాయందిసుమంతయైనఁ కనికరంబుంచక ఖడ్గంబు చేబూని వధింపుడు.

(అని దినకరునియందు దృక్కులు జేర్చి.)

గీ. సకలలోకశరణ్యాయో సరసిజాక్ష
జన్మజన్మములకు నాకుసత్యుడుగను



యీహరిశ్చంద్రనృపతి ప్రాణేశుడగుచు
నుండునట్టులజేయు మఖండతేజా.

హరి. ఆహా! ఈసుదతీమణి ధైర్యంబునకును, వినయవివేకంబులకును, నిర్మలస్వాంతంబునకును, నామనంబువిస్మయంబొందుచున్నయది గాన శింధువేలావలయిత వసుంధరాభారభరణ సామర్థ్యంబున నొప్పు నాభుజాదండంబున ప్రచండ తరంబగు మక్కరవాలంబున నీచంద్రమతిఁ దెగవేశెద.

(అనిఖడ్గంబెత్త విశ్వామిత్రుండువచ్చి ఖడ్గంబుబట్టుకుని.)

విశ్వా. రాజా! నీవుమానవుడొ గాని దానవుండవుగావు. మాకులగురుండగు వశిష్టుండు నీకుమగువలంజంప ధర్మోపదేశంబొనరించినవాడాయేమి. ఇట్టిక్రూరకృత్యం బొనరించుటమేరగాదు. బలవంతులగు వైరులం దునుమశక్తిగల నీఖడ్గంబుచే, పురంధ్రీశిరోమణి నెట్లుఖండింపం బూనెదవు, భూపాలా! రూపరేఖా విలాశినులును మక్కమారికలును నగు మతంగాంగనల వరించినఁ పూజ్యంబగు సాంమ్రాజ్యంబును, నీకుమారునిప్రాణంబులును, నీకులాంగనతోడి పొందునుఁ గలుగజేసెద, నామాటనమ్ముము.

హరిశ్చంద్రుడు.

గీ. గాధినందననాచేతి ఖడ్గమునను
యీసరోజాక్షిశిరము ఖండించికీర్తిఁ
లోకమున వెలయజేయుదు ప్రాకటముగ
శోకతో చేతికడ్డంబు రాకుమిపుడు.

మునీంద్రా! యితరులంబోలెనన్నుంభ్రమింపజేయనేల, రాజ్యంబురాకపోయినం బోనిమ్ము గాని సత్యంబుదప్ప, మీరునావిన్నపంబాచరించి ఖడ్గంబువిడువుడు.

(అనిన విశ్వామిత్రుండు ఖడ్గంబువిడచి నిష్క్రమించె.)

(నంతహరిశ్చంద్రుండు కరవాలంబుచే చంద్రమతి కంఠ నాళంబు నరకవేయ నదిపుష్పధామంబై యొప్పెనప్పుడు)

హరి. (తనలో)ఆహా! యీనీలవేణి కంఠ నాళంబుదెగుటకు ఖడ్గంబువ్రేయ నది ప్రసూనమాలికయై యీపురంధ్రీశిరోమణిగళంబునయభిరామంబుగనున్నయది. యిత్తమ్మికంటి పాతివ్రత్య మహిమంబుననో మధ్యుజాశక్తి దూలిచననో, నాకుందోచకున్నయది నేను సత్యసంధుండనేని యీఖడ్గంబునన్ నీసాధ్వి కంఠనాళంబు దెగుంగాక,

(అని ఖడ్గంబెత్తివ్రేయబోవుసమయంబున పురందరాది బృందారక సందోహంబుగొలువ, బ్రహ్మరుద్రులతోడన్ శ్రీమన్నారాయణుండు ప్రత్యక్షుండై.)

విష్ణు. హరిశ్చంద్రమహారాజా! నీసత్యంబున కేముమెచ్చితిమి, నినుబోలునృపాలు లీబదునాలుగులోకంబులన్ గలరే, నీనూనృతాలాపగుణధైర్యలక్షణ సాహసవైభవాదులెన్న సహస్రముఖునికైనం దరమె, గానగాధిసూనుని కపటకృత్యంబున మీరిట్లనేక విపద్ధశలనుభవించవలసె, నాతండును నీసత్యవ్రతంబు దెలియంగోరి, యిట్లొనరించినవాడు. నిను భృత్యుంగాగొనినవాడుకృతాంతుండుగాని చండాలుండుగాడు, నీసతిన్ దాశిగాగొనినవాడుకలిపురుషుండుగాని భూసురుండుగాడు, యిందులకు నీడెందంబున సందేహంబువలదు, దివ్యదృష్టి నొసంగెదన్ జూడుము.

(అని నారాయణుండుబల్కిన హరిశ్చంద్రుండు దివ్యజ్ఞానంబున, నంతయున్ బరిగించి సంతోషించి యాభగవంతునికి పునఃపునః ప్రణామంబులాచరించి.)



క. వందనము భక్తవత్సల
వందనముదయాసముద్ర వాసవవంద్యా
వందనము లోకరక్షా
వందనమువికుంఠవాస వరసువిలాసా.

హిందుస్తాని - తోడిరాగము - అటతాళము.

కనకమణిమయదివ్యభూషణా- గరుడ- గమనసరసిజదళలోచనా
చనువునమీపాద వనజములనుమది- నమ్మితి- నిన్నుగోరితి! కనక
శ్యామసుందరభక్తపోషణా- వరం- ధామదానవగణశోషణా
సామజనుతఫణిశయన నీమరుగున- జేరితి- బ్రతిమాలితి! కనక!
భాషాపతిజనక బ్రోవరా- నా- దోషములనుయెన్నబోకురా
రోషించదొరవని పొందుగనినుయా- శించితి- శరణుజేసితి! కనక!
ధరపేరుకలపూడి పాలనా- పావ- హరణమందరశైలధారణా
వరశేషయుపోష వాసవనుతజగ- న్మోహనా- పరమపావనా-కనక!

విష్ణు. రవికులభూషణా! నీభక్తితాత్పర్యంబుల కేనుమెచ్చితి,నీకు వరత్రయం బొసంగితిగోరుము.

హరి. లక్ష్మీపతీ! యిప్పుటభేదనంబు పరిపాలించు రాజకొమరుని బ్రతికించిన యాచంద్రమతి, నింద తప్పుగాన వానిన్ సజీవుంజేయ వరంబొసంగుము.

విష్ణు. హరిశ్చంద్రా! యాతండింతకుమున్న సజీవుండైయుండు భవత్తనూజునికి ప్రాణంబొసంగితి సంతసంబొందుము.

(యిట్టిసమయంబున లజ్జావనతవదనుండై గోపంబుమాని విశ్వామిత్రుండువచ్చి)

విశ్వా. హరిశ్చంద్రా! నేనహంకృతిచే మీకిట్టులాపద లొందజేసితిని. మున్ను దేవేంద్రునిసభ నింద్రుండు, సత్యవంతుడగు రాజెవ్వం

డని ప్రశ్నించిన వశిష్ఠుండు నిన్ను జేర్కొనెన, నందుకేను వాని తోడఁగలహించి వివేకవిహీనతచే మిమ్ములం జేసితి. నీనిత్య సత్య మహిమకేరుమెచ్చితి, పూజ్యంబగు సామ్రాజ్యంబొసం గెదంగొని స్థిరంబుగనేలుము.

హరి. ఋషిశ్రేష్ఠా! మీరలిటులానతియ్యఁ వలదు, మీరుసర్వజగస్తో త్రనియ్యులుగాన నామనవివినుండు, యేనింక రాజ్యంబొల్ల మీ కిష్టుండగు పార్థివేంద్రునిచే యీభూచక్రం బేకచక్రంబుగ నే లింపుము.

విశ్వా. భానుకులాబ్ధిచంద్రా! నీకిష్టుండగు రాజున కీరాజ్యంబొసంగు మని బల్కితివి. నాకుప్రియుండవునీవు, యీయాధిపత్యం బేను నీకొసంగెద, నీవల్లలకుంటివేని మత్ప్రతిజ్ఞాభంగంబగు, ప్రతిజ్ఞా భంగంబుకంటె దురితంబెద్దియు లేదు. మత్ప్రతిజ్ఞ వినుము, యివ్వ సుంధరఁ బదునాల్గు మహాయుగంబు లేలింతుననియు, నిన్నిమ నంతరం బింద్రలోకంబుననునిచెదననియు బలికినవాఁడ నిందుకొ ప్పుకొనుము.

(వశిష్ఠుండుజని.)

వశిష్ఠు. హరిశ్చంద్రమహారాజా! యీ యిక్ష్వాకు కులంబునఁగలకీర్తిఁ బ్రతిష్ఠించితివి. యేను గాధిసుతునితో జేసిన ప్రతిజ్ఞంగాపాడి స త్యవ్రతంబునిల్పితివి, పురోహితుండనగు మద్వాక్యమాచరిం చితివి. యేనానందంబొందినవాఁడ యుగ్గాధిపుత్రుండు నీతోడం బలికిన వాక్యంబులకునమ్మతించుట నాకిష్టంబు నీవుశీఘ్రంబున పట్టాభిషిక్తుండవుగమ్ము.



హరి. గురువరాగ్రగణ్యా! లోకవరాయణుండగు నారాయణుని సమ్ము ఖంబున కులగురువులగు మీరలొసంగిన శలవునకు బద లాడుమా టలాడువాఁడఁగాను, యుగ్గాధినందనునకును మీకును నెటులి ష్టంబో నటులనేనొనరించువాఁడ నటులనొనరింపుడు.

విష్ణు. హేమహాపురుషులారా! మీరిరువురుఁ గలసి పుణ్యోదకంబులచే పత్నీపుత్రసహితంబుగా నిత్యసత్య వ్రతుండగు యీహరిశ్చం ద్రచక్రవర్తికి యిప్పుడ పూజ్యసామ్రాజ్యంబున కభిషేకం బొ నర్పుడు.

అని నారాయణుండు శలవొసంగి తనవెంట నరుదెంచినబ్రహ్మా దిదేవతలతోడ యథాస్థానంబుల కరిగె, నంత నమ్మహాపురుషులఁ దోడ్కొని హరిశ్చంద్రుం డయోధ్యాపురంబునకుంజని రాజ్యం బేలుచు పుత్రకళత్రంబులతోడఁ సుఖంబుండె.

ఝంఝూటిరాగము - ఆదితాళము.

హారతిదుగో కేశవా- సారసభవజనకమంగళం॥ హా॥
భూరిభుజగశయనహాని- పోషితామరేంద్రవినుత॥ హా॥
మందరాద్రిధారణముచి- కుందపోషఖగతురంగ॥ హా॥
యిందుభాష సన్నుతమృదు- సుందరచరణాచ్యుతనీకు॥ హా॥
ధరను వెలయు పేర్కలపురి- దనుజభంజనపరమపావన॥ హా॥
వరములొసగు శేషయాఖ్య- వరదాయకకరివరనుత॥ హార॥

---

# గద్యము.

ఇది శ్రీరుక్మిణీసత్యభామాసమేత శ్రీవేణుగోపాలచరణారవింద
మకరంద పానేందిందిరాయమానమానసుండును
పరాశరవంశ క్షీరపారావార రాకాకైర
వాప్తుండును సుకవిజనవిధేయుండును
జోగయాచార్యపుత్రుండునగు
శేషాచార్యప్రణీతంబైన

## శ్రీహరిశ్చంద్రచరిత్రము.

సర్వంబును ద్వితీయాంకము
సంపూర్ణము.






